

ు - చెణుకులతో నిండ,
దిని కడుపుబ్బ నవ్వించే...
ర సంభాషణలతో కూడిన

# హాస్య ప్రపంచం

యరా సత్యనారాయణ B.Sc., B.Ed.,

# జోక్స్ వరల్డ్

## (హాస్య ప్రపం...)


యర్రా సత్యనారా...

కంకటపాలెం-522...







✆ (08644) 23037, 22392



**జనప్రియ పబ్లికేషన్స్,**

అగ్నికుల క్షత్రియుల వారి వీధి-II,

గంగానమ్మపేట, తెనాలి-522 201.

# "ముందుమాట"

"నవ్వు నాలుగు విధాల చేటు!" అనే పెద్దల 'నానుడి' కొన్ని సందర్భములకే పరిమితము! పెడర్థాలు, విపరీత భావాలు, వ్యంగ్యము ఇలాంటి అపోహలు ఏర్పడకుండా ఉండుటకు ముఖ్యముగా స్త్రీలను దృష్టిలో ఉంచుకొని ఆనాడు అలాంటి నానుడిని సృష్టించారు. ప్రస్తుతము నవ్వును గురించి శాస్త్రవేత్తలు ఏమి చెప్పారో పరిశీలిద్దాము! "నవ్వు- గుండెజబ్బులను, ఊపిరితిత్తుల వ్యాధులను, మానసిక రుగ్మతలను దూరము చేస్తుంద"ని ప్రయోగపూర్వకముగా శాస్త్రవేత్తలు రుజువు చేసారు. నవ్వు ముఖమునకు- అందమును, మనస్సుకి- ఉల్లాసమును కలిగిస్తుంది. తీవ్రమైన పని భారము వలన కలిగే- మానసిక ఒత్తిడి, అలసట, ఆందోళనలను దూరము చేస్తుంది. కనుక "నవ్వు- నాలుగు విధాల గ్రేట్!" అని చెప్పకోవచ్చు!

నవ్వు ముఖము- శుభ సూచకము! ఒక వరము!! నవ్వు ముఖము- ఇతరులను ఆకర్షిస్తుంది! సీరియస్ ముఖము- అనేక అపోహలకు, ఛీత్కారాలకు దారి తీస్తుంది!! పని భారము, మానసిక ఆందోళన, మానసిక న్యూనతాభావము, ఆలోచనలు, సమస్యలు ముఖమును సీరియస్‌గా మారుస్తాయి. కనుక... "ఈ సమస్యలను కొద్దిసేపు దూరము చేసికొనుటకు ఈ పుస్తకము కొంతవరకైనా ఉపయోగపడుతుంద"న్నే నమ్మకముతో వ్రాయుట జరిగినది. ఇందులోని 'జోక్స్' కొన్ని మీకు తెలిసినవే కావచ్చు! కొన్ని కొంతమందిని ఉద్దేశించినట్లుగా కనిపించవచ్చు!! ఏది ఏమైనా ఈ పుస్తకము లోని జోక్స్ తమాషా కొరకు వ్రాసినవే!!! ఇందులోని జోక్స్ అన్నీ కాకపోయినా... కొన్ని పేలినా నా ప్రయత్నము కొంతమేరకు నెరవేరినట్లే!!!! ఈ పుస్తకముపై మీ సలహాలను- సూచనలను, మార్పులు-చేర్పులను తెలియజేస్తారు కదూ..!

...మీ,

—యర్రా సత్యనారాయణ,

B.Sc., B.Ed.



# "జోక్స్ వరల్డ్"
## (హాస్య ప్రపంచము)



1] **ఇంకా ఎంతమంది ? :–** కుమారుడు (తల్లితో): "అమ్మా! ఈ రోజు మా బడిలో టీచర్- నన్ను 'నీ కింకా తమ్ముళ్ళు చెల్లెళ్ళు ఉన్నారా'అని అడిగింది"
తల్లి: "మరి నీవేం చెప్పావురా బాబూ?"
కుమారుడు: "నేను ఒక్కడినే! అని చెప్పాను!"
తల్లి: "మరి మీ టీచర్ ఏమందిరా?"
కుమారుడు: "హమ్మయ్య! బ్రతికించావ్!! అన్నది."

2] **లాయరెందుకు ? :–** న్యాయమూర్తి (విచారణ చేస్తూ అడిగారు ముద్దాయిని) : "నీ తరఫున లాయర్‌ను పెట్టుకోవా?"
ముద్దాయి: "అబ్బే ఎందుకండీ! నేనెలాగు నిజము చెప్పేద్దా మనుకుంటున్నా!! ఇక లాయరెందుకు? దండుగ!"

3] **వేట కుక్కను కొనిస్తా! :–** రాణి :- "మీ పుట్టిన రోజుకని నేను స్వయముగా చేసిన వంటకం అంతా మన కుక్క తినేసిందండీ !"
రాజు : "బాధపడకు రాణీ! నీకు నేను వేటకుక్కను కొనిస్తానులే!!"

4] **మూడు మేకలు :–** టీచర్: "ఒరే రవి! పాలిచ్చే జంతువులు ఆరింటిని చెప్పు!"
రవి: "ఆవు, గేదె, గొర్రె మరి మూడు మేకలు!"

5] **ఏమి చేయాలి? :–** టీచర్: "ఒక పెద్ద బరువైన లాయిని నీ కుడిచేతివైపు నుండి, ఎడమ చేతివైపుకి మార్చాలంటే ఏం చేయాలిరా రాజా ?"
రాజు : "ఆ ఏముంది... టీచర్!? చాల సింపుల్!! ఆ లాయికి కుడివైపు కెళ్ళ నుంచుంటే సరి!!!"

6] **నీ అభిప్రాయం ఏమిటి? :–** ఒక కేసు విచారణ జరుగుతోంది. బోనులో నిలబడియున్న ఒక సాక్షితో....
జడ్జి: "ఆ దంపతులు పోట్లాడుకొనుట నీవు కళ్లారా చూచావా?"

పాత్రి: "చూచానండీ"

పాత్రి: "దీనిపై నీ అభిప్రాయము ఏమిటి?"

పాత్రి: "ఇక భవిష్యత్ జీవితములో పెళ్ళి చేసుకోకూడదని నిర్ణయించుకున్నానండీ"

**7] అబద్ధాలాడితే... ఏమౌతుంది? :-** తల్లి కొడుకుని మందలిస్తోంది. చెడ్డ గుణం పర్యవసానమును తెలియ చెప్పాలనే ఉద్దేశముతో మాట్లాడుతూ...

తల్లి: "అబద్ధాలాడితే ఏమౌతుందో తెలుసా నీకు?"

కుమారుడు: "ఎందుకు తెలియదూ? బస్‌లో అరటికెట్‌పైన వెళ్ళవచ్చు కదా" (తల్లి బస్ కండక్టర్‌తో తన వయస్సు నాలుగే నని చెప్పిన విషయమును గుర్తుకు తెచ్చుకుంటూ)

**8] ఎందుకని ? :-** "ప్రస్తుత అమెరికా అధ్యక్షుడు ఒకవేళ మనింటికి వస్తే కూర్చోండి అన్నా, ఆయన కూర్చోరు. ఎందుకని?"

"ఆయనకు తెలుగు రాదు కనుక"

**9] ఎక్కడికి ? :-** ఇద్దరు మిత్రులు- ప్రశ్నచెప్పుడు వేటకి వారు ఇంట్లో కలుసుకున్నప్పుడు వారి సంభాషణ ఇలా సాగింది.

మొదటివాడు: "హల్లో బ్రదర్! ఎక్కడికి? షికారుకా?"

రెండవవాడు: "అవునే కాదురా!? ఊరికే అలా షికారుకి..."

మొదటివాడు: "అలాగా!? షికారుకేమో అనుకున్నారా!"

ఇద్దరు మిత్రులా ఇలా పలకరించుకొని, ఉత్సాహముగా నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.

**10] విల్లు వ్రాయడానికా ? :-** డాక్టర్: "కరిచింది పిచ్చి కుక్క కాబట్టి... రేబిస్ వ్యాధి సోకింది. బహుశా నీకు మరణము తప్పదేమో!?" విచారముగా చెప్పాడు.

రోగి: "మంచిది డాక్టర్! దయచేసి ఒక పేపర్, పెన్ ఇవ్వండి!!"

డాక్టర్: "ఎందుకని? విల్లు వ్రాయడానికా?"

రోగి: "కాదు డాక్టర్! నేను ఎవరెవరిని కరవాలో లిస్ట్ వ్రాసుకునేటందుకు!! ఇంతకీ తమరి పేరు ఏమిటో?"

11] **నా రిస్ట్ వాచ్ ఎక్కడ ? :-** డాక్టర్: "గుండె ఆపరేషన్ తరువాత మీకు ఎలా ఉంది? కులాసేనా??"
రోగి : "నా బొంద కులాసా.... ఆపరేషన్ చెయ్యకముందు ఒక్క గుండె ఉన్నట్లు... ఆపరేషన్ చేసాక... రెండు గుండె లున్నట్లు... తోస్తుంటేనూ!" కసిగా చెప్పాడు.
డాక్టర్ : "ఆ! తెలిసింది... నేను రిస్ట్‌వాచ్ ఎక్కడ మరిచి పోయింది" కంగారుగా అరిచాడు.

12] **ఆయన చేయడు! :-** రమ: మా ఆయన ప్రతిరోజూ ఉదయము T.V.లో వచ్చే ఫిట్‌నెస్ ప్రోగ్రామ్ వేళకు తప్పని సరిగా లేస్తుంటారు."
ఉమ: "అలాగా! ఐతే T.V.ని చూచి ఆయన ప్రాక్టీస్ చేస్తున్నా రన్నమాట! మా ఆయనా ఉన్నాడు ఎందుకు?"
రమ: "లేదు ఆయన చేయరు. ఎదురింటి డాబాలో ఉన్న పిల్ల చేస్తుంది. అందుకనీ..."

13] **ఆ ఒక్కడికి ఇవ్వలేదు :-** డాక్టర్: "ఏమిటి? ముగ్గురు పేషెంట్లలో రాత్రి ఇద్దరు చనిపోయారా సిస్టర్?? ఐతే నేను ఇచ్చిన మందులు పేషంట్స్‌కు ఇవ్వలేదా ఏమిటి???"
సిస్టర్: "సారీ డాక్టర్! బ్రతికిన ఆ ఒక్క పేషెంట్‌కు మీరిచ్చిన మందులు ఇవ్వడము మరిచాను."

14] **నాదే ! నాదే !! :-** ఆఫీసులో ఒక తమాషా చేద్దామనే ఉద్దేశంతో ప్యూన్ ఇలా అరుస్తాడు....
"ఎవరైనా రబ్బర్ బాండ్ వేసిన కరెన్సీ నోట్లు కట్టను పోగొట్టుకున్నారా?"
నలుగురైదుగురు ఒకేసారి "నాది పోయింది నాది...."
ప్యూన్: "కానీ... నాకు ఈ రబ్బర్ బ్యాండ్ దొరికింది."

15] **ఏ నెలకు ? :-** టీచర్: "ఒరే! లాయర్ గారబ్బాయ్! నీ పేరేమిటిరా?"
విద్యార్థి: "ఆంజనేయ వరప్రసాదండీ!"
టీచర్ : "నా ప్రశ్నకు జవాబు చెప్పు.... ఏ నెలకు ఇరవై ఎనిమిది రోజులుంటాయి?"
విద్యార్థి: "అన్ని నెలలకూ ఉంటాయి గదా సార్!"

"వద్దు... ఇలాంటివి విఠలాచార్య సినిమాలో చూసుకోవచ్చులే."

"బావిలో మోటార్ సైకిల్ పైన ఒకతను గిర్రున మెరుపు వేగంతో తిరుగుతాడట."

"చిరంజీవి సినిమాలో వీటి బాబుల్లాంటివి చూడొచ్చులే."

"అందమైన అమ్మాయిలు రంగు రంగుల బ్రా, కట్ డ్రాయర్స్ ధరించి; తెల్లని గుర్రాల మీద డాన్స్ చేస్తారట డాడీ!"

"అలాగా! ఐతే పద... తెల్లని గుర్రాలు చూసి చాలారోజులైంది."

**22] ప్యూన్ అంటేనే... :-** "పిల్లలూ! స్కూల్ మొత్తంలో మీకు ఎవరంటే ఇష్టం?" అడిగాడు ఆ రోజే కొత్తగా డ్యూటీలో జాయిన్ ఐన మాస్టార్! "లాంగ్ బెల్ కొట్టే ప్యూన్ అంటే మాకు ఎంతో ఇష్టం!" అన్నారు పిల్లలు ఒక్కసారిగా.

**23] భార్యను కూడా... :-** "డార్లింగ్! ప్రేమ ఎంతో మహోన్నతమైనది. నీకోసం అందర్నీ చివరకు కన్న తల్లిదండ్రులను, తోడబుట్టిన వాళ్ళని కూడా వదిలేసి వచ్చేను." అంది ఎంతో సాహసం చేసానన్న గర్వంతో! "నేను కూడా అందర్నీ వదిలేసి వచ్చా.. తల్లి దండ్రుల్ని చివరకు నా భార్యా బిడ్డల్ని కూడా...." చల్లగా చెప్పాడు రాజు!

**24] పిసినారి భర్త :-** "పరమ పిసినారి భర్త అంటే ఎవరో తెలుసా...?" "ఒక నిరోధ్ లూప్‌ను నాలుగైదుసార్లు కడిగి ఉపయోగించుకొనేవాడు."

**25] భయపడకమ్మా :-** కొత్తగా చేరిన పనిపిల్లని- తన భర్త వద్ద ఎలా ప్రవర్తించాలో హితబోధ చేస్తోంది. "నేను ఊరికెళ్ళినప్పుడు ఆయనతో వెధవ్వేషాలు వెయ్యకూడదు. ఒకవేళ వేసావో... ఇంతకుముందు పనిపిల్లకు పట్టినగతే పడుతుంది".

"మీరేమీ భయపడకండమ్మా! నాకు ఆపరేషన్ ఐపోయింది!" అభయమిస్తూ అన్నది పనిపిల్ల.

**26] అదేంకాదు... :-** "మాకు పెళ్లై పదేళ్ళు కావస్తోంది పిన్నీ... ఫ్ట్ కానీ... కర్మకు ఎవరు బాధ్యులు ?"

"పాపం పిల్లలు లేరన్లే ఉంది."

"పిల్లల గురించి కాదు. ఇంకా మా వారికి వంట చేయడమే రాలేదు."

27] **నెల తప్పింది... :** "ఏరా నాని! మా టీచర్ పైన అంత అభాండం వేసారేమిట్రా? 'పెళ్ళి కాకుండానే... నెల తప్పింద'ని చెబుతున్నావట..."
"అవును డాడీ! నిజంగానే మా టీచర్ నెల తప్పింది. ఈ నెల ఏప్రిల్ ఐతే, 'మే' అని వ్రాసిందిగా..."

28] "అదేమిట్రా !? బస్ కండక్టర్ అలా చిరాకు పడుతూ... బూతులు తిడుతుంటే ఎవ్వరూ మాట్లాడరేం !?"
"ఛీ! గడ్డిగా అనవకు! ఆయన తెలుగు సినిమా మాటల రచయితలే!!! డైలాగ్స్ వ్రాయడమేగాక... చెప్పడం వలన... ఇలా ప్రైవేట్ సర్వీస్‌లో చేరాల్సి వచ్చింది."

29] "బస్ టికెట్ వెనుక చిల్లర—చిల్లర అని వ్రాస్తాడేమిటి ఆయన?!" ఆశ్చర్యంగా అడిగాడు.
"టికెట్ వెనుక రాసిన చిల్లర మొత్తాన్ని... మరిచిపోతానేమోనని ఆయన బెంగ"

30] **టీచర్ అమాయకత :-** "ఒరే కిట్టూ! నీ దగ్గర పది రూపాయలు ఉందనుకో... మీ నాన్న నడిగి మరో ఇరవై రూపాయలు తీసుకున్నావనుకో... అప్పుడు నీ దగ్గర ఎంత ఉంటుంది ? కరెక్ట్‌గా చెప్పు!"
"పది రూపాయలండీ !"
"అబ్బే! నీకు అంతగా లెక్కలు తెలియవనుకుంటా?"
"అవునండీ! మా నాన్నగారి గురించి కూడా... మీకు అంతగా తెలియనట్లుంది!"

31] **ఏదీ దాచుకోకూడదు :** "చూడమ్మా! లాయర్ల దగ్గర ఏదీ దాచకూడదు. ఉన్నదున్నట్లు చెప్పాలి. తెలిసిందా ?"
"తెలిసింది! ఓ కుర్ర లాయర్ దగ్గర ఏదీ దాచుకోకపోబట్టే... ఇలా మీ దగ్గరకు రావలసి వచ్చింది" అంది కడుపు తడుముకుంటూ...

32] ఆఫీస్ సీట్లో ఆసీనుడై యున్న సూర్యం పేపర్ మీద- ఏవో తీసివేతలు, గుణకారములను చేస్తున్నాడు. అప్పుడే వచ్చిన అప్పారావు అడిగాడు...
"ఏమిట్రా ? ఉదయాన్నే ఏవో జమా-ఖర్చులు వ్రాస్తున్నావ్!"
"అవునా! మా ఆవిడ ఒళ్ళు తగ్గడానికి డాక్టర్‌గారు కొన్ని మందులూ, ఎక్సర్‌సైజ్‌లూ చెప్పాడు. ప్రస్తుతం ఆవిడ 140 కిలోలుంది. ఈ మందుల వలన వారానికి కనీసం నాలుగు కేజీలు తగ్గుతారట. దీని ప్రకారం ఎన్ని నెలల్లో మొత్తం పూర్తి ఔతుందో లెక్కలు తేలుస్తున్నాను" అన్నాడు సూర్యం.

33] ఒక పెద్ద మనిషి- భార్యతో ఇలా అన్నాడు...
"నాకీ మధ్య మతిమరుపు ఎక్కువైపోతోందే... గొడుగు తీసికోవడం మరచిపోయాను"
"ఎప్పుడు జ్ఞాపక మొచ్చింది?"
వర్షం తగ్గిన తరువాత మూసేద్దామని చూస్తే చేతిలో కనిపించలేదు.

34] "మా అబ్బాయి అస్తమానం మట్టి నోట్లో వేసుకుంటున్నాడండీ"
అంటూ పిల్లల డాక్టర్ దగ్గరికొచ్చింది రామలక్ష్మి.
"ఏడీ ఆ కుర్రాడు? పిల్లల విషయంలో... ఏం కంగారు లేదండీ! అలా చేయడం, ఆ వయసులో మామూలే"
"నాకేం కంగారు లేదండీ ! మా కోడలే చాల కంగారుగా ఉన్నది"

35] "ఈసారి కూడా ఫెయిల్ కావాలని కోరుకుంటున్నాను !
'ఎందుకే?' తన ఫ్రెండ్‌ని అడిగింది రీటా.
"ఈసారి ఫెయిల్ ఐతే... నీకు పెళ్ళి చేసేస్తా అన్నాడే మా నాన్న"
సిగ్గుపడుతూ పలికింది రీటా.

36] కోర్టులో కేసు విచారణ జరుగుతోంది...
"ఇతరుల జేబులను కత్తిరించినపుడు... సిగ్గువేయదా నీకు?" ప్రశ్నించాడు జడ్జిగారు.
"వేస్తుందండీ! వాటిలో ఒక్క పైసా కూడా లేనపుడు..."

37] లవర్స్ పార్క్‌లో కూర్చున్న మోహన్ దగ్గరకు కొచ్చింది కమల.

"నువ్ తండ్రివి కాబోతున్నావ్ మోహన్" అంటూ.. అతడి ఒడి వాలిపోయింది.

"నాకు ఆ సంగతి నిన్నే తెలుసు?"

"అరే.. చిత్రంగా ఉందే? నీకెలా తెలుసు??"

"డాక్టర్ దగ్గర టెస్ట్ చేయించుకొచ్చి మా ఆవిడ చెప్పిందిలే !"

38] "మన పెళ్ళికి మీ వాళ్ళు ఒప్పుకోకపోతే విషం తాగి చచ్చిపోతా" అంది సునీత

"వద్దు నువ్వు పోయిన తరువాత.. పోలీస్ స్టేషన్‌లు, కోర్టులు చుట్టూ తిరగలే

నేను చావాలి. అసలే నాకు B.P. కూడాను"

39] "మంత్రిగారు నిన్ను కొట్టి బండబూతులు తిట్టారా?"

"అవునండి.. ఇన్‌స్పెక్టర్‌గారూ!"

"కొట్టింది నిన్ను కళ్ళారా చూసావా?"

"అవును సార్"

"ఎక్కడ కొట్టారో చెప్పు"

"వీపు మీద కొట్టారండి! ఎర్రగా కంది వాచిపోయిందండి!!"

"ఎవరి వీపు మీద?"

"నా వీపు మీదేనండి"

"వీపు వెనకవైపు కదా ఉంది. కొట్టినప్పుడు నీవెలా చూడగలిగావ్?"

"నన్ను క్షమించండి సార్! బుద్ధి తక్కువై కంప్లైంట్ చేసాను"

"అలాగైతే.. మంత్రిగారికి క్షమాపణ లెటర్ రాసివ్వుపో!"

40] ఒక సైంటిస్ట్ తన పాత మిత్రుని దారిలో కలిసాడు. ఆశ్చర్యముతో "మీరు పోయారని చెప్పారే..?!" అన్నాడు- సైంటిస్ట్!

"అదెలా సాధ్యం ! మీ ముందు నిలుచున్నది సాక్షాత్తు నేనేకదా?" అన్నాడా మిత్రుడు!

"మీ మాటలు తప్పక నమ్మను. నాకు ఈ విషయం చెప్పిన వారు మీకన్నా ఎంతో నమ్మకస్తులు" అన్నాడు సైంటిస్ట్.

41] చేపలు తింటున్న చెంచురామయ్యకి గొంతులో చేప ముల్లు గుచ్చుకు పోయింది. దానితో కంగారుపడి... వెంటనే... డాక్టర్ దగ్గరికి పరుగెత్తు కెళ్ళాడు. డాక్టర్ ఆ ముల్లును నొప్పి ఏ మాత్రము లేకుండా కడు జాగ్రత్తగా తీసాడు.

"డాక్టర్‌గారూ! ముల్లుని చక్కగా తీసారు. ఫీజ్ ఎంత ఇవ్వమంటారూ?" అడిగాడు చెంచురామయ్య!

"ఆ ముల్లు మీ గొంతులో గుచ్చుకొని ఉన్నప్పుడు మీ రివ్వామనుకున్న దానిలో సగమిచ్చినా... సంతోషమేనండీ!" అన్నాడు బ్రతక నేర్చిన ఆ డాక్టర్!

42] లాయర్: "చూడు మహానుభావా! మొన్న ఆదివారం రాత్రి నువ్వు మర్డర్ జరిగిన చోట లేవనీ, నీ ఇంట్లో ఉన్నావనీ సాక్ష్యంతో రుజువు చేస్తే... నీకు జైల్ శిక్ష తప్పిపోతుంది."

మేనేజర్ రామలింగం: "రైట్ సార్! ఆ విషయం నాకూ తెలుసు!! ఆ రోజున నిజంగా... నేనూ, నా సెక్రటరీ మిస్ రోజీ... ఊరి చివరి ఫ్రెండ్స్ బంగళాలో వున్నాం. ఆ పని చూచుకుంటూ... ఆ మాట చెబితే మీరు వదిలేస్తారు. బాగానే ఉంది. మరి మా ఆవిడ పట్టుకుంటుందిగా ?"

43] భార్య: "మన పెళ్ళి కాకముందు నాలాంటిది ఈ లోకంలోనే లేదని అనేవాడివి" అంది ఏడుస్తూ.

భర్త: "ఔను! ఇప్పుడూ అదే అంటున్నాను."

44] జడ్జ్: "నీ మీద మోపిన నేరం రుజువు కాలేదు. నువ్వు నేరస్తుడివి కాదు. అందువలన నిన్ను నిరపరాధిగా విడుదల చేస్తున్నాం"

ముద్దాయి: "ఐతే... ఇక పోలీసుల భయం లేకుండా... ఆ కాస్తుం సారాని నిర్భయంగా అమ్ముకోవచ్చు సార్?!"

45] జడ్జ్: "నువ్వు ఇంతకీ నేరం చేసానంటావా? చెయ్యలేదంటావా? సరిగ్గా చెప్పు!"

ముద్దాయి: "అది కనుక్కోవడానికే కదా మీకు జీతమిస్తున్నారు!"

46] కళ్ళ డాక్టర్: "చూడు బాబు! ఆ సినిమా వాల్‌పోస్టర్‌లో పెద్దలకు మాత్రమే అనే దాని ముందున్నది ఒక అక్షరం పెద్దదిగా కనిపిస్తున్నది. అదేమిటో చెప్పు!
పిల్లవాడు: "రెండు సున్నాలు మాత్రం బాగా కనిపిస్తున్నాయండి!"

47] భార్యాభర్తలు ఎలా మెలగాలో... భర్తకు ఉదాహరణలతో భార్య చెబుతున్నది
భార్య: "పక్కింటాయన ప్రతిరోజూ ఆఫీస్ కెళ్ళేటప్పుడు తన భార్యను కౌగిలించుకొని, ఒక ముద్దిస్తాడు తెలుసా?" నిష్ఠూరముగా అంది భార్య
భర్త: "అందుకు నేనేం చెయ్యను?" విసుగ్గా అడిగాడు.
భార్య (మురిపెంగా): "మీరూ అలా చెయ్యరాదుటండీ!"
భర్త: "నాకైతే అభ్యంతరము లేదు గాని... అందుకు ఆవిడ అంగీకరిస్తుందా?" సందేహంగా ఫోజ్ పెట్టాడు.

48] ఒక ఆరేళ్ళ పిల్లవాడు తన తండ్రితో "నాన్నా! మనిద్దరిలో ఎవరు తెలివి గలవారో చెప్పండి నువ్వా? నేనా??"
"నేనేరా! అందులో సందేహం ఎందుకు?"
"ఎలాగో చెప్పండి!?"
"నీ కన్నా ఎక్కువ అనుభవం, వయసు ఉన్నాయి!"
"ఐతే... పెన్సిలిన్‌ని ఎవరు కనుగొన్నారో... చెప్పండి డాడీ?"
"అలెగ్జాండర్ ఫ్లెమింగ్ పెన్సిలిన్‌ని కనుగొన్నాడు" గర్వంగా చెప్పాడు తండ్రి.
"ఐతే... అలెగ్జాండర్ ఫ్లెమింగ్ తండ్రి ఎందుకు కనుక్కోలేదు? అతని కన్నా తండ్రే మేధావి కదా??"
తండ్రి మారుమాట్లాడలేదు మరి.

49] "నా కుమార్తె కడుపునొప్పికి వెంటనే ఆపరేషన్ చేయక తప్పదా డాక్టర్!" బాధగా అడిగాడు ఒక పల్లెటూరి రైతు.
"వేరే దారి కనపడలేదయ్యా! కాసేపాగితే... అదే తగ్గిపోతుంది. ఆ తరువాత ఆపరేషన్ చేయడానికి నీవుగాని, నీ కుమార్తెగాని ఒప్పుకోరు" బాధగా చెప్పాడు డాక్టర్.

50] "మిమ్మల్ని ఆ రౌడి సన్నివేశం నిజంగానే మానభంగం చేస్తుంటే... మీ రెందుకు అరవలేదు ?" ప్రశ్నించాడు జడ్జ్.
"షూటింగ్ కదా ! డబ్బింగ్ చెప్పేటప్పుడు కేక వేయవచ్చులే.. అని ఊరుకున్నా" బావురుమంది హీరోయిన్ సౌమ్య

51] వినోద్: "డాక్టర్ గారూ...! మత్తు ఇంజక్షన్‌లు చేయకుండా... ఆపరేషన్ చేయాలి. చేయగలరా మీరు?"
డాక్టర్: "ఓ చేయగలను. మీరు చాల ధైర్యము గలవారులా ఉన్నారే? మీకు ఏ ఆపరేషన్ చేయాలి?"
వినోద్: "అబ్బే... ఆపరేషన్ నాక్కాదండీ బాబూ ! మా అత్తగారికి చేయాలి"

52] విద్యార్థులు వ్రాసిన పరీక్ష పేపర్స్ దిద్దడానికి... పేపర్స్ కట్టను చంకన పెట్టుకొని వెళుతున్న లెక్చరర్‌ను చూచి ఒక కొంటె విద్యార్థి ఇలా అన్నాడు.
విద్యార్థి: "సార్ భలేవారే మీరు...! ఒక గాడిద బరువు మోస్తున్నారు!!"
లెక్చరర్: "ఒక్క గాడిద బరువుకాదు నాయనా ! వంద గాడిదల బరువు మోస్తున్నాను..."

53] పత్రికా విలేఖరి: సినీతారను ఇంటర్వ్యూ చేస్తూ....
"మీ వయస్సు ఎంతో చెప్పండి !"
"నా వయస్సు పదహారు సంవత్సరాలు !"
"అదేంటండీ? పదేళ్ళ క్రితము కూడా ఇలాగే చెప్పారు !"
"అవునయ్యా..! పదహారు సంవత్సరాల, 120 నెలలు !!"

54] ఉపాధ్యాయుడు: "ఒరే రాము! ఇంగ్లీష్ ఛానెల్ ఎక్కడ ఉందిరా?"
విద్యార్థి: "ఏమో తెలియదు సార్ ! మా T.V.లో లోకల్ ఛానెల్స్ మాత్రమే వస్తాయి."

55] జబ్బుతో ఉన్న భార్య (భర్తతో): "ఏమండీ! నా మీద మీకు నిజంగా ప్రేమ లేదు. నేను చనిపోయిన మరుసటి రోజే... మళ్ళీ పెళ్ళి చేసుకునేలా ఉన్నారు."
భర్త: "లేదు కాంతం ! కొన్ని రోజులు విశ్రాంతి తీసుకుంటాను."

56] ప్రకాష్: "ఏమిటి? నీవు ప్రేమించిన అమ్మాయికి మీ తాతయ్య సినీ నిర్మా
అని చెప్పినా పెళ్ళికి ఒప్పుకోలేదన్నమాట?"
రమేష్: "అచ్చే! ఎందుకు ఒప్పుకోలేదు....? ఐతే నాతోకాదు మా తాతతో

57] సైన్స్ ఎగ్జిబిషన్‌లో ఒక సభ జరుగుతోంది. ఒక శాస్త్రవేత్త ఉపన్యసిస్త
"ఇంకో 80 కోట్ల సంవత్సరములలో- భూగోళము అంతరించి పోతుంది
అని చెప్పాడు.
ముందు గ్యాలరీలో కూర్చుని... కునికిపాట్లు పడుతున్న ఒక ముసలాయన
ఉలిక్కిపడి లేచి కంగారుగా "ఎంతని చెప్పారూ? మళ్ళీ చెప్పండి!" అన్నాడు
"80 కోట్ల సంవత్సరాలు" అని శాస్త్రవేత్త ఆశ్చర్యముతో చెప్పాడు!"
"ఓ సరి సరి! 80 లక్షలేమోనని భయపడ్డానులెండి!" అంటూ..
ముసలాయన మళ్ళీ కూలబడి కునుకు తీయసాగాడు.

58] **త్రాగుబోతుల సంభాషణ :-** దేవదాసు : "ఈ లోకంలో ఉన్న
బంగారాన్ని వజ్ర-వైడూర్యాల్ని, ఫ్యాక్టరీల్ని.. ఒక టేమిటి... అన్నీ కొనేస్తాను."
రామదాసు: "నీవు చెప్పిన వాటిలో వేటినీ నేను అమ్మనుగాక.. అమ్మను."

59] ఒక సభ జరుగుతోంది. కొంతమంది వక్తలు ప్రసంగించిన తరువాత
సభాధ్యక్షుడు : "మిగిలిన నాయకుల ప్రసంగాలను రేపటికి వాయిదా
వేస్తున్నాను. కనుక రేపు మళ్ళీ కలుద్దాం."
నిర్వాహకులలో ఒకడు: "ఇతగాడ్ని సభకు అధ్యక్షుడిగా పిలవొద్దని నెత్తి
నోరు బాదుకున్నా.. విన్నారా ?"

60] ఒక పెద్దాయన రొప్పుతూ పోలీస్‌స్టేషన్ కొచ్చి S.I. తో ఇలా చెప్పాడు.
"S.I. గారూ! మా అమ్మాయి రేప్ చేయబడింది. వెంటనే నేరస్థుల్ని
పట్టుకొని న్యాయం చేయండి !!"
S.I.(ఆశ్చర్యంగా): "ఏమిటీ.... రేప్ చేయబడిందా? మేము ఛస్తే నమ్మం!
నిన్న నేను, మా కానిస్టేబుల్స్ ఊళ్ళోనే లేముగా....? మరి ఎలా జరిగింది??"

61] "అయ్యా.. కార్టూనిస్ట్‌గారూ ! మీరు గీసిన బొమ్మేమిటో అసలు అర్థం
కావటం లేదండీ ?"
"నాకు కూడా అర్థంగాకనే దానికి 'స్త్రీ' అని పేరు పెట్టా!"

62] సినిమా హాల్ బుకింగ్ క్లర్క్ : "ఏమిటి... ఇప్పటి కిప్పుడే మీరు నాలుగో టికెట్ కొంటున్నారు?"
ప్రేక్షకుడు: "తెలుసు లేవయ్యా... హాల్ గేట్ దగ్గర ఎవరో పిచ్చోడు నిలబడి, నేను లోపలికి అడుగు పెట్టగానే... నేను కొన్న టికెట్‌ని లాక్కొని, రెండు ముక్కలుగా చించి, ఒకటిచ్చి ఒకటి లాక్కుంటున్నాడు. మరి నేనేం చేసేది ?"

63] డాక్టర్: "మీ ఆయనకి పూర్తి విశ్రాంతి అవసరము !"
ఆమె: "ఆయనకి పూర్తి విశ్రాంతి అవసరమా? ఏమిటండీ... మీ ఉద్దేశ్యం ?? ఇప్పుడు నే నాయన్ని హింసిస్తున్నాననేగా ???"

64] కామేశ్వరరావు: "మా మేనేజర్ ఎంతో గొప్ప అదృష్టవంతుడు"
సోమేశ్వరరావు: "ఎలా?"
కామేశ్వరరావు: "ఆయన భార్య పేరు కమల! ఆఫీసులో సెక్రెటరీ పేరూ కమలే!! అంచేత నిద్రలో ఏం గొణిగినా ఫరవాలేదు."

65] ఉపాధ్యాయుడు: "ఒరే రాము ! నక్షత్రాల పేర్లు చెప్పరా ?"
రాము: "అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆరుద్ర, ఆత్రేయ, సి॥నా॥రె, వేటూరి, కొసరాజు..."

66] కమల: "అస్తమానం ఆడపిల్లల్ని ఏడిపించుకు తినే ఆ రామారావ్‌ని జీవితాంతం ఏడ్వేలా చేస్తానని విమల శపథం చేసిందే."
అమల: "ఐతే... వాణ్ని పెళ్ళి చేసుకుంటుందన్నమాట !"

67] డాక్టర్: "సారీ మీ ఆవిడ ఇక కొద్ది గంటలకంటే బ్రతుకదు... బాధపడకండి!"
భర్త: "ఇరవై ఏళ్ళ నుంచి బాధ పడుతున్న వాణ్ణి! ఇక కొద్ది గంటలు బాధపడలేనా డాక్టర్ !"

68] సుగుణ: "బడ్జెట్ ప్రభావం మీవారిపై బాగా పడిందన్నావు ! ఎలా?"
సుందరి: "ధరలు పెరగటం మూలంగా... మావారు సిగరెట్స్ మానేసారు. అవి లేందే... నవలలు రాయలేరు. ఆ విధంగా పొదుపు, సాహిత్య సేవ చేస్తున్నారు."

69] శోభనం గదిలో సుగుణారావుని సుజాత ఇలా అడిగింది "మీరు :
పెళ్ళికి ముందు ఎవర్నీ ప్రేమించలేదా?"
సుగుణారావు పది నిమిషాలు మౌనంగా ఉన్నాడేగానీ జవాబు చెప్పల
"జవాబు చెప్పరేం ?" అడిగింది సుజాత.
"ఆగు... ఇంకా లెక్కపెడుతున్నాను" అన్నాడు తాపీగా సుగుణారావు.

70] ఒక త్రాగుబోతు తన గదిలో కూర్చొని తాపీగా త్రాగుతున్నాడు.
భార్య కోపంగా వచ్చి అతని చేతిలోని గ్లాసు తీసికొని వాసన చూచి, నాలు
ఆ మందుని చప్పరించి, ఇలా అన్నది...
భార్య: "ఛీ ఛీ! పరమ గబ్బు, చేదు, వికారం... ఇది త్రాగకపోతేనేం
భర్త: "చూసావా...? నేనేదో త్రాగి బాగా సుఖపడి పోతున్నానని నీ భ్ర
ఇప్పుడు తెలిసిందా త్రాగి నేనెంత బాధపడుతున్నానో?"

71] విశ్వనాథ్: "నేను క్రొత్తగా ఒక కుక్కని తెప్పించాను. దాన్ని కాస్త చూడవ్వా
రామనాథ్: "అలాగే ! అది కరుస్తుందా ? కరవదా ?"
విశ్వనాథ్: "అది తెలిసికోవడానికే నిన్ను వచ్చి చూడమన్నది."

72] సినీతార: "నేను నా తొలి చిత్రంలో నటించినప్పుడు మీరు తీసిన ఫో
చాల బాగుంది. ఇప్పుడు అలా తీయలేకపోతున్నారే ?"
ఫొటోగ్రాఫర్: "అప్పటికీ ఇప్పటికీ దానికి ఒక్కటే కారణం మేడమ్ !
కెమేరాకు ఇరవై ఏళ్ళ ముసలితనం వచ్చింది. అంతేగాని నా లోపం ఏ
లేదు."

73] రాజు: "రానురాను నాకు మతిమరుపు ఎక్కువైపోతుంది. ఏం చేయాలో అర్థ
గావట్లేదు..."
రాము: "ఏమైం దేమిటి ?"
రాజు: "గుడికి వెళ్ళి వచ్చేటప్పుడు... మళ్ళీ పొరపాటున నా పాత చెప్పు
తొడుక్కొచ్చేను !"

74] కొడుకు: "లాగే కొద్దీ ఆనందం ఎక్కువయ్యే దానికి... ఒక ఉదాహరణ
చెప్పు డాడీ !"
తండ్రి: "సిగరెట్ బాబూ!"
కొడుకు: "కాదు నాన్నా.. ఆ మాత్రం కూడా తెలియదా ? చీర!"

75] సుబ్బారావు: "ఒరే సుందర్రావ్! నీవు కలకత్తా వచ్చి హోటల్‌లో సర్వర్‌గా చేరి మూడేళ్లైంది కదా!! నీ భార్య నిన్ను మరిచి పోయి ఉండదా ?"
సుందర్రావ్: "ఛ! నా భార్య అలాంటిదేం కాదు. అలా ఐతే... ఇప్పుడు తనకి ఆరో నెలని నాకు ఎందుకు లెటర్ రాస్తుంది ?"

76] బసవయ్య: "నా స్కూటర్ వేయి రూపాయలకు కొన్న మాట నిజమే మరి! ఐతే... యాభై కిలోమీటర్స్ స్పీడ్‌తో పోతుంది. నీకు తెలుసా?"
రమణయ్య: "ఆహా! అబ్బో... అలాగా !? ఎంత లక్కీ ఫెలోవి నీవు ?"
బసవయ్య: "కాకపోతే... అంత వేగంగా తోసేవాళ్ళుండాలి మరి."

77] గయ్యాళి: "మా పెళ్ళైన రెండు నెలలకే మా వారు పోయారు. ఒక రోజు హఠాత్తుగా గుండె నొప్పి అన్నారు. అంతే... వెంటనే పోయారు."
పొరుగింటి పుల్లమ్మ: "అదృష్టవంతుడు! ఎక్కువ కాలము బాధ పడలేదు... చల్లగా జారుకున్నాడు !!"

78] ప్రేమికురాలు : "నీతో పెళ్ళికి ఒప్పుకోపోతే నీవు నిజంగా ఆత్మహత్య చేసుకుంటావా ?"
ప్రియుడు: "అవును డియర్! పదేళ్ళ నుండి నాకున్న అలవాటే అది."

79] బాలుడు: "అమ్మా! ఈ క్రీమ్‌ను ఐదేళ్ళ నుండి వాడుతున్నావు ఎందుకు ?"
తల్లి: "అందంగా కనిపించడానికి బాబూ !"
బాలుడు: "ఐతే... షాపువాడు నిన్ను మోసగించాడు!"

80] విలేఖరి: ముఖ్యమంత్రిగారు బస్ ప్రమాదంలో ప్రమాదవశాత్తు మరణిస్తే... మీ రెవరిని సపోర్ట్ చేస్తారు ?"
మంత్రి: "బస్ డ్రైవర్ని !"

81] భార్య: "ఆ పిచ్చి కుక్కను మచ్చిక చేసికోవడం మీ వల్ల కాని పని..."
భర్త: "బస్... అదెంత పని? మన పెళ్ళి ఐన తరువాత నిన్ను మచ్చిక చేసికోలా ? దాని కంటే కష్టమా ఇది ??"

82] రైతు రామయ్య ఆరోగ్యం సరిగా లేక డాక్టర్ దగ్గరకు చెకప్‌కని వెళ్ళాడు.
డాక్టర్: "నీకు మందు(మద్యము) కొట్టే అలవాటుందా ?"
రామయ్య: "ఉందండీ డాక్టర్‌గారూ !"

డాక్టర్: "అతే తక్షణమే ఆ అలవాటుని మానుకోవడం మంచిది."
రామయ్య: "అచ్చే కుదరదండీ! మందు (క్రిటక నాశని) కొట్టకపో పంట(పైరు) నాశనమై పోతుందండీ !!"

83] పైనో పోస్టుకు ఇంటర్వ్యూ జరుగుతోంది. మేనేజర్ అడిగాడు మేరీ
మేనేజర్: "ఇంతకుముందు దేన్నైనా అనుభవం ఉందామ్మా ?"
మేరి: "ఉందండీ ! ముగ్గురు పిల్లలు కూడా!!"

84] రంగనాథం: "అతను నకిలీ డాక్టరని ఎలా కనిపెట్టావ్ ?"
సోమనాథం: "ఎక్సరే తీయించుకోమని చెప్పి... ఫోటోస్టూడియో అడ్ర వ్రాసిచ్చాడు."

85] నర్స్: "డాక్టర్‌గారూ ! నాలుగో నంబర్ గదిలోని పేషెంట్ తనకో ముద్దు మంటున్నాడు."
డాక్టర్: "ఇచ్చేయ్! రేపేగా ఆపరేషన్!? అప్పటి వరకు సంతోషం ఉండనీ!"

86] ఒక తెలివైనవాడు ముంబాయిలోని రెడ్‌లైట్ ఏరియాలో ఒక మం భవనాన్ని అద్దెకు తీసికొని, మెయిన్‌గేట్ దగ్గర పెద్ద అక్షరాలతో ఒక బోర్డ్ తయారు చేసి పెట్టించాడు. ఆ బోర్డ్‌లో ఇలావ్రాసి ఉన్నది. "ఎనలే విశ్వాసము, అందమైన-నాణ్యమైన పిల్ల కావాలంటే... లోని దయచేయండి!" రగిలే కోరికలతో వచ్చినవాడు తీరా లోపలి కెళ్ళి చూ ఏముంది? కుక్కపిల్లల్ని అమ్మడానికి పెట్టాడు.

87] గజదొంగ గంగన్న భార్య దుకాణం పెట్టింది. అన్ని షాప్స్‌కన్నా తక్కు ధరలకు సరకులను ఇచ్చి ఆశ్చర్యంలో ముంచెత్తించింది.
ఒక పుల్లయ్య ప్రశ్న: "మీకు ఎలా గిట్టుబాటు ఔతున్నాయమ్మా?"
గంగన్న భార్య: "ఏముంది... సరకులన్నీ మా వారు రాత్రుళ్ళు కష్టపడి తెచ్చేవేగా ?"

88] విలేఖరి: "మీరు తీరిక సమయాలలో ఏం చేస్తుంటారు ?"
సినీతార: "సాధారణంగా షేక్సపియర్ నవల్స్, వర్డ్స్ వర్త్ సీరియల్స్ చదువుతుంటాను."

89] నలుగురు కొలీగ్స్ ఆఫీస్‌లో పని పూర్తైన తరువాత హోటల్ కెళ్ళారు. నలుగురూ ఇడ్లీ తినటానికి నిశ్చయించుకొని, సర్వర్ రాగానే ఆర్డర్ ఇచ్చారు.

మొదటి ఉద్యోగి : "నా ప్లేట్‌లో ఎక్కువ చెట్నీ వెయ్యి !"

రెండవ ఉద్యోగి : "నా ప్లేట్‌లో ఇడ్లీలు బాగా వేడిగా ఉండాలి !"

మూడవ ఉద్యోగి : "ఇడ్లీ ఎలా ఉన్నా... ప్లేట్ మాత్రం శుభ్రంగా ఉండాలి."

నాలుగవ ఉద్యోగి : "నా ఇడ్లీలలో అల్లం చెట్నీ ఎక్కువ వేయాలి!" పది నిమిషాల తరువాత సర్వర్ ఇడ్లీ ప్లేట్లతో వచ్చాడు. తికమక పడినవాడిలా ఇలా అంటాడు.

సర్వర్ : "క్షమించాలి ! మీలో శుభ్రమైన ప్లేట్‌లో తెమ్మన్నదెవరో మరిచిపోయాను సార్ !" అన్నాడు... అతి వినయంగా!

90] కొత్త పెళ్ళికొడుకు పండుగకి అత్తగారింటికి వచ్చాడు. పడగ్గదిలో భార్యతో సరసాలాడుచుండగా... గడియారం పది గంటలు కొట్టింది. కొత్త పెళ్ళికొడుకు భార్యతో ఇలా అంటాడు.

క్రొత్త పెళ్ళికొడుకు : "చూదావా? నేను నీతో ఉండగా గంటలెలా గడచి పోతున్నాయో??" అన్నాడు గొప్పగా.

ఇంతలో లోపలి నుండి భార్య తండ్రి కేకవేసాడు... "అమ్మాయ్! గడియారం బాగైంది!!"

91] లాయర్ : "చూడమ్మా మీ ఆయనకు ఎందుకని విడాకులు ఇవ్వాలను కుంటున్నావ్...? ఆయన ఒక పెద్ద ఆఫీసర్ కదా...?! మరొక్కసారి ఆలోచించుకోవమ్మా తొందరపడితే నీకే నష్టం!!"

ఆఫీసర్ భార్య : "అన్నీ ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చానండీ! నా బాధ ఏమని చెప్పమంటారు? నేను ప్రేమగా వారి ఒడిలో కూచుంటే చాలు... ఉత్తరాలు డిక్టేట్ చేయడం మొదలెడతారు. అలా కనిపెట్టాను... ఆయనకి- ఆఫీస్‌లో స్టెనో మేలీకి ఉన్న లింకె" అంటూ బావురుమంది.

92] తండ్రి: "అమ్మా! నీ సంగీత సాధన ఎలా ఉంది?"
కుమార్తె: "బావుంది నాన్న! మా గురువుగారు మంచి భక్తిపరులు కూడా
తండ్రి: "అలాగా ? చాలా మంచిదమ్మా!"
కుమార్తె: "ఆ... ! నేను పాడుతుంటే ఆయన 'హరి భగవంతుః' అంటుంటాడు చెవులు మూసుకుని!"

93] ప్రియురాలు: "రాజా...! నువ్వు నిజంగా నన్ను మనసారా ప్రేమిస్తున్నావా ?
ప్రియుడు: "ఔను ప్రియా ! అందులో సందేహ మెందుకు ?"
ప్రియురాలు: "ఐతే... నా కోసం చావటానికి కూడా సిద్ధమేనా ?"
ప్రియుడు: "సారీ డార్లింగ్ ! నాది అమరప్రేమ... నా ప్రేమకు చావనే లేదు."

94] కుమారుడు: "అమ్మా నేను కూడా ఈత కెళ్తానే!! "
తల్లి: "అమ్మో ! వద్దు బాబూ !! చాల లోతుంది. పైగా సుడిగుండాల కూడా ఉన్నాయి. చాలా ప్రమాదము ! "
కుమారుడు: "మరి నాన్న ఈదుతున్నారుగా ?"
తల్లి: "ఆయన లైఫ్ ఇన్సూరెన్స్ చేసారులే బాబూ !"

95] ఇద్దరు పల్లెటూరి రైతులు మొదటిసారిగా రైల్ ప్రయాణం చేస్తూ.. తినేందుకు ఒక డజన్ అరటి పండ్లను కూడా వెంట తెచ్చుకుంటారు. రైల్ ప్రయాణము సాగుతూనే ఉంటుంది. అప్పుడు ఒక రైతు... అరటికాయను తింటాడు. అంతలో రైల్ ఒక పెద్ద టన్నెల్‌లో ప్రవేశిస్తుంది. వెంటనే అరటి పండు తింటున్న రైతు కంగారుపడి పెద్దగా రెండవ రైతుతో ఇలా అంటాడు.
మొదటి రైతు: "రామన్నా ! అరటికాయ తినవద్దు! తిన్నావా?"
రెండవ రైతు: "ఏం ? ఎందుకని ?? ఇంకా తినలేదు !"
మొదటిరైతు: "మంచిది నీవు చాలా అదృష్టవంతుడివి! నేను అరటికాయ తిన్నంతలోనే... గ్రుడ్డివాడిగా మారిపోయాను. నాకు ఇప్పుడేం కనిపించటం లేదు !"

96] సుబ్బరాజు : "సార్ ! నిన్న మీ పెంపుడు కుక్క మా అత్తగారిని వెంటబడి-మరీ కరిచింది !"
నాగరాజు : "అలాగా?! వెరీ సారీ సర్ !! నన్నేం చేయమంటారు... చెప్పండి ?"
సుబ్బరాజు : "మీ కుక్కను వెంటనే నాకు అమ్మాలి."

97] సెక్రెటరీ : "మా M.P. గారి రక్తంలో ట్రుబుల్ ఏమిటండీ ? అంత బుఱ్ఱ బద్దలు కొట్టుకోవడానికి !?"
డాక్టర్ : "ఆ...! ఏం లేదు... ఏ గ్రూప్ అనేది కనిపెట్టడమే కాస్త సమస్యగా ఉంది."

98] మామగారు : "ఏమిటి అల్లుడూ !? అమ్మాయిని చీటికి మాటికి తిడుతున్నావట... నిజమేనా ?"
అల్లుడు : "అంతా అబద్ధం ! అసలు ఎవరన్నారా మాట ? ఆ దరిద్రపు వెధవ భడవ పాకీముండను నేనెందుకు తిడతాను !?"

99] వీర్రాజు : "నిన్న... నువ్వూ మీ ఆవిడ పోట్లాడు కున్నారంటగా ? ఎందుకు ??"
పేర్రాజు : "ఆ! ఏం లేదు. మా ఇంట్లో పనిచేసే అప్పలమ్మ నేను రాత్రిపూట కలవరించి, పట్టుబడిపోయాను... అందుకని."
వీర్రాజు : "అందుకే నా భార్య పేరేగల పనిమనిషిని మా ఇంట్లో పెట్టాను."

100] ప్రొప్రైటర్ : "ఏమయ్యా సర్వరూ...! ఆ కస్టమర్ అలా రుస రుసలాడుతూ వెళుతున్నాడేమిటి? ఏం జరిగింది ??"
సర్వర్ : "చపాతీ ఆర్డర్ చేసాడండీ ఆయన...! కొంచెం లేటైంది. దాంతో ఈ హోటల్లో టిఫిన్ తిని పళ్ళు రుబ్బే కంటే... ఉడిపి హోటల్లో రుబ్బుకోవటమే బెటర్ అంటూ కోపగించుకొని వెళ్ళిపోతున్నాడండీ!"

101] **అంత డబ్బేం చేసికోనూ...? :-** సుగుణారావు : "చెడ్డ అలవాట్లన్నీ మానుకుంటే... మా నాన్న నాకు లక్ష రూపాయ లిస్తానన్నాడు."
సంగీతరావు : "మరింకేం! అలా చెయ్యకూడదూ... బోల్డంత డబ్బు వస్తుంది కదా...?"
సుగుణారావు : "ఆ...! ఎందుకు ఏ అలవాటూ లేకుండా అంత డబ్బేం చేసికోనూ... ?"

**102] ఎవర్ని నాన్నా...? :-** ప్రేమలో పడ్డ కూతురితో తండ్రి వరహాల ఇలా అంటాడు.

వరహాలరావు : "అమ్మా ! నువ్వు ప్రేమించిన వతనితోనే నీకు జరిపిస్తాను. సాయంత్రం అతన్ని ఇంటికి తీసుకురామ్మా !"

కూతురు సుశీల : "ఎవర్ని నాన్నా ? మురళీనా.... రాజానా.... డేవిడ్ రహీంనా ??"

**103] పోలీస్ కేస్ :-** పోలీస్ వెంకటస్వామి సరదాగా అలా బజారు తిరుగుతూ... ఒక తోపుడు బండివాడి దగ్గర ఆగి... వాడితో ఇలా అంటా

పోలీస్ వెంకటస్వామి : "ఉచితంగా ఒక కొబ్బరి బొండాన్ని కొట్టివ్వవోయ్

బండివాడు : "ఇంకా బోణీ కాలేదయ్యా అసలు నీ కెందుకివ్వా ఇవ్వకపోతే... ఏం చేస్తావ్ ??"

పోలీస్ వెంకటస్వామి : "ఒక వ్యక్తి కొడవలి పుచ్చుకొని నడిరోడ్డు మీ అనుమానాస్పదంగా తిరుగుతున్నాడని... కేస్ బుక్ చేసి, బొక్కలో తోయి జాగ్రత్త !"

**104] ఇప్పుడైతే డూప్ వద్దు :-** సినిమా షూటింగ్ జరుగుతున్న అసిస్టెంట్‌తో ఇలా అంటాడు డైరెక్టర్.

డైరెక్టర్ : "ఇంకా హీరో రాడేమిటయ్యా వెళ్ళి ఎంత సేపయింది?"

అసిస్టెంట్: "ఎవరితోనో మాట్లాడుతున్నారు సార్! రెండు షాట్లు డూప్‌చే చేయించుకోమంటున్నాడండీ !"

డైరెక్టర్ : "ఇది శోభనం సీనని చెప్పవయ్యా ! పరిగెత్తుకుంటూ వస్తాడు

105] సుబ్బారావు పెళ్ళాం సంగీతకు సంగీతం అంటే చాలా ఇష్టం ! కానీ... ఎం సాధన చేసినా... లాభం లేకుండా పోతుంది. భర్త కూడా విసిగిపోయి ఇ అంటాడు.

సుబ్బారావు : "ఇక సంగీత సాధన ఆపి, శ్రావణ మంగళవారం నోమ పాటలు నేర్చుకోకూడదూ ?"

సంగీత: "ఏం ?! అలా అంటున్నారేం !?"

సుబ్బారావు : "అవైతే ఏడాదికి ఒక్కసారి మాత్రమే పాడుకోవచ్చు"

106] ఓ శతాధిక వృద్ధురాలిని ఒక పత్రికా విలేఖరి ఇంటర్వ్యూ చేస్తూ అన్నాడు.
విలేఖరి : "మీ దీర్ఘాయుష్షుకు కారణం ఏమిటో చెప్పగలరా ?"
వృద్ధురాలు : "ఆ...! ఏముంది చెప్పకోడానికి...? తొమ్మిది మంది సంతానాన్ని, ఇంటి పనుల్నీ మా ఆయనే గమనించేవారు. పాపం ఆయన నలభై ఐదేళ్ళకే పోయారు."

107] భార్య: "ఏమండీ ! శ్వాస గట్టిగా పీలుస్తుంటే... సూక్ష్మక్రిములన్నీ శరీరంలో నుంచి బయటకు వెళ్ళిపోతాయటండీ !"
భర్త(సందేహంగా) : "మనం శ్వాస గట్టిగా పీలుస్తున్నట్లు... సూక్ష్మక్రిములు కెలా తెలుస్తుంది?"

108] మాస్టర్: "ఏ యుద్ధంలో హర్షవర్ధనుడు మరణించాడు ? చెప్పరా కిషోర్ !"
కిషోర్: "ఆయన చేసిన చివరి యుద్ధంలో నండీ !"

109] గోపాల్: "పదివేల రూపాయల చెక్కు ఎవరికి పంపిస్తున్నావ్‌రా?"
భూపాల్ : "మా డిటెక్టివ్ మావయ్యకు పుట్టినరోజు బహుమతిగా పంపిస్తున్నాను."
గోపాల్: "మరైతే చెక్కుమీద సంతకం చేయకుండా పంపుతున్నావేం?"
భూపాల్: "సస్పెన్స్! ఎవరు పంపించారో ఆయనకి తెలియకూడదు!!"

110] విలేఖరి: "మీ విజయానికి కారణం ఏమిటి ?"
బాక్సర్: "నా ప్రత్యర్థి మొహంలో... మా ఆవిడను ఊహించుకున్నా! అంతే... వెర్రి ఆవేశం వచ్చి వాడిని చిత్తు చేసేసా !"

111] ఒక కంపెనీలో పనిచేస్తున్న స్టెనో... తన పెళ్ళికి తోటి ఉద్యోగులు అందరినీ తప్పక రమ్మని ఆహ్వానించింది. కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్(M.D.)ని కూడా ఆహ్వానించింది. ప్రత్యేకంగా తోటి ఉద్యోగు లందరూ తలా ఒక బహుమతి చదివించారు. కాని... మేనేజింగ్ డైరెక్టర్ మాత్రం ఒక డిక్షనరీని చదివించాడు.

112] ఒక హైస్కూల్ విద్యార్థులు, టీచర్స్ ఎక్స్‌కర్షన్‌కు వెళ్ళారు. దారిలో వారి సంభాషణ :
మొదటి విద్యార్థి: "ఒక వంద అప్పు ఇవ్వరా...! ఇంటి కెళ్ళగానే ఇచ్చేస్తా !"

రెండవ విద్యార్థి: "ఇంటి కెళితే... నేనూ ఇవ్వగలను."

మొదటి విద్యార్థి: "ఏ కెరి వస్తుంది?"

రెండవ విద్యార్థి: "నువ్విస్తానన్నావ్ గదా?"

113] గుమాస్తా: "సార్ ! నా భార్యకు ఆరోగ్యం బాగా లేదు. ఈ రోజు సెలవు ఇప్పించండి ! డాక్టర్ దగ్గరికి తీసికెళ్ళి చూపించాలి."

ఆఫీసర్ (నవ్వుతూ) : "అవును చెప్పడం మఱిచాను ! నా స్మృతి మఱపు మండా !! ఇంతకుముందే మీ ఆవిడ ఫోన్ చేసింది. తనకు ఆరోగ్యము కుదుటపడిందట ! నువ్వు సెలవు పెట్టి రావలసిన అవసరం లేదని చెప్పమంది."

గుమాస్తా: "భలే వారండీ మీరు...! నే నే అబద్ధం చెప్తున్నా నను కున్నాగాని... నా కన్నా మీరే రెండాకులు ఎక్కువ చదివారు. అసలు నా కింకా పెళ్ళే కాలేదు !"

114] పూలమ్మి: "ప్రతిరోజూ కనీసం ఒక మూరైనా పూలు తీసికెళ్ళేవారు! ఈ రోజు వద్దంటున్నారేంటి ? అమ్మగారు ఊర్లో లేరాండీ ?!"

ఆసామీ: "అదేం కాదుగాని... నాకే ఒంట్లో ఓపిక లేదు."

115] ఒక నర్సింగ్‌హోమ్‌లో ఒకామె మగబిడ్డను ప్రసవించింది. ఆ పిల్లాడి కళ్ళు పిల్లి కళ్ళలా ఉన్నాయి. నర్స్ ఆశ్చర్యంగా ఇలా అంది.

నర్స్: ఏమమ్మా ! ఈ పిల్లాడి తండ్రికి పిల్లి కళ్ళు ఉన్నాయా ??"

ఆమె : "ఏమోనమ్మా ! చీకట్లో... సరిగ్గా గమనించలేదు!" అని నాలిక్కరుచుకొన్నది.

116] తల్లి: "ఒరే భానూ ! అదేంట్రా... నూకలు కోడిపిల్లకు వేయమంటే కుక్కకు పెడుతున్నావ్?"

కొడుకు: "కోడిపిల్ల ఆ కుక్క పొట్టలోకేగదా వెళ్ళింది ! అందుకే"

117] లెక్కల మాస్టర్ : "ఏ వెధవరా... నీకు లెక్కలు నేర్పింది? అన్నీ తప్పులే చేస్తున్నావ్??"

విద్యార్థి: "అదేంటి సార్?! నేను మొదట్నుంచీ మీ దగ్గరేగా లెక్కలు నేర్చుకుంటున్నది."

క్తి రైల్ పట్టాలమీద పడుకొని ఉంటాడు. అది చూచి... ఒక వ్యక్తి
ంటాడు :
ఏమిటి ? రైల్ క్రింద పడి, చద్దామనా ??"
పైనున్న వ్యక్తి : "అవును... నాకు జీవితం మీద విరక్తి పుట్టింది.
దామనే ఇక్కడ పడుకున్నాను."
మరలాగైతే... ఈ ఆహార పదార్థము లెందుకు ?"
పై నున్న వ్యక్తి : "ఒక వేళ రైల్ ఆలస్యమైతే ఎలా...? ఆకలి చావు
ం నాకిష్టం లేదు.".
పెండ్లి సంబంధం చూడ్డానికి బయట ఊరికెళ్ళి తిరిగి వచ్చిన
..
"ఏమండీ ! మీరు వెళ్ళినపని- పండా ? కాయా ??"
ప్రచ్చు" అని తక్కున చెప్పాడు.
రసలు కచ్చితంగా పాటించే- ఒక పల్లెటూరి రైతు తన భార్యను
ం గవర్నమెంట్ హాస్పిటల్‌కి వస్తాడు. రెండు రోజులు గడిచిన
త నర్స్‌తో...
ఏయ్ మరదలా ! ఇలారా !!"
ఏమిటండీ ఆ పిలుపు ! సిస్టర్ అని పిలవాలి."
ఏందమ్మో.. నర్సమ్మా..!? నాకు వావి-వరుసలు తెలియవనుకున్నావా?
భార్య నిన్ను సిస్టర్ అని పిలిచింది కదా ! ఆ ప్రకారం నీవు నాకు
లవేగా... సిస్టర్ ఎలా ఔతావు...?"
వరహాలరావుకు గుమాస్తా అవసరం వచ్చింది. అందుకని
మందిని ఇంటర్వ్యూ చేయదలచాడు. వడ్డీ వ్యాపార అనుభవము
రిలో పాపారావు- ఒకడు.
లరావు : "బాబూ ! నూటికి నెలకి 8 రూపాయల వడ్డీ చొప్పున
రూపాయలు ఒకతనికి అప్పు ఇచ్చామనుకో ! 27 నెలలకి ఎంత
ందో క్షణంలో చెప్పు!!"
రావు : "అప్పు తీసుకున్నవాడు చదువుకున్నవాడా ? చదువురాని
?? ముంది సంగతి చెప్పండి!"

122] ఫోన్‌లో మాట్లాడుకుంటున్నారు ఇద్దరు మిత్రులు! వారి పేర్లు- అప్పారావు కృష్ణారావు.
అప్పారావు: "హలో! నేను... అదేరా... అప్పారావుని మాట్లాడుతున్నాను."
కృష్ణారావు: "హలో! అప్పారావా? నేను కృష్ణారావుని... ఏమి విశేషాలు?"
అప్పారావు: "ఆ! ఏం లేదు... ఒక వెయ్యిరూపాయలు అర్జంట్ అవసరం! అందుకనే ఫోన్ చేశాను."
కృష్ణారావు: "ఆ! ఏంటి? సరిగ్గా వినపడటం లేదు."
అప్పారావు: "వెయ్యి రూపాయలు అప్పు కావాలి."
కృష్ణారావు: "ఏంటో...? అసలు వినిపించి చావడం లేదు."
మధ్యలో టెలిఫోన్ ఆపరేటర్ సువర్ణ కలుగజేసుకొని
"అదేమిటండీ?! వినిపించడం లేదంటారు. వెయ్యిరూపాయలు అప్పుగా కావాలని స్పష్టంగా వినిపిస్తుంటేను."
కృష్ణారావు: "అలాగా తల్లీ...!? ఐతే ఆ వెయ్యి రూపాయల అప్పు నువ్వే ఇచ్చెయ్!" అని చెప్పి ఠక్కున ఫోన్ పెట్టేశాడు.

123] రంగారావు: "డాక్టర్‌గారూ! నాకీ మధ్య సెక్స్ బలహీనత ఏర్పడింది."
డాక్టర్ (పరీక్షించిన తరువాత): "నిజమేనండీ. మీరు మళ్ళీ సెక్స్‌లో ఉత్సాహంగా పాల్గొనాలంటే రోజుకు ఐదు మైళ్ళ చొప్పున పరుగెత్తాలి. మళ్ళీ ఒక వారం తరువాత ఫోన్ చేసి చెప్పండి! మీ పరిస్థితి మెరుగైందో... లేదో?" వారం తరువాత... రంగారావు ఫోన్ చేస్తాడు డాక్టర్‌కు.
డాక్టర్: "రంగారావుగారూ... మీ పరిస్థితి మెరుగైంది కదూ?!"
రంగారావు: "ఎలా చెప్పేది? సెక్స్‌లో పాల్గొంటేకదా తెలిసేది??"
డాక్టర్: "ఏమైంది?"
రంగారావు: "మీరే గదండీ... రోజుకు ఐదు మైళ్ళ చొప్పున పరుగెత్తమన్నది. ఇప్పటికి వారం ఐంది. ఊరికి 35 మైళ్ళ దూరంలో ఉన్నానండీ!"

124] రోగి: "నాకు బొత్తిగా ఏమీ జ్ఞాపకం ఉండటం లేదు డాక్టర్‌గారు."
డాక్టర్: "ఓహో! అలాగా... ఎంతకాలం నుండి ఇలా జరుగుతున్నది?"
రోగి: "ఎలాగ డాక్టర్?! ఏ విషయం?"

125] రోగి : "నాకు రాన్రాను మతిమరుపు ఎక్కువైపోతున్నది డాక్టర్‌గారు."
డాక్టర్ : "మీరెలా చెప్పగలరు ?"
రోగి : "ఒక్కోసారి ప్రక్కవాళ్ళ జేబనుకొని... నా జేబునే బ్లేడ్‌తో కట్ చేసుకుంటున్నాను."

126] తండ్రి : "ఒరే శేఖర్! బాగా చదువుతున్నావట్రా ?"
కుమారుడు శేఖర్ : "బాగానే చదువుతున్నాను డాడీ ! నాకన్నీ ఫస్ట్ మార్కులే !!"
తండ్రి : "గుడ్ ! అలా చదవాలి. ఇంతకీ ఏ ఏ సబ్జెక్ట్‌లో ఎన్నెన్ని వచ్చాయి మార్కులు ?"
శేఖర్ : "ఇంగ్లీష్‌లో ఒకటి, తెలుగులో ఒకటి, లెక్కల్లో ఒకటి, సైన్స్‌లో ఒకటి, సోషల్‌లో ఒకటి, హిందీలో ఒకటి... ఇలా అన్నిట్లోనూ ఫస్ట్‌మార్కులే వచ్చాయి"

127] వరహాలరావు : "సర్వర్! కాఫీ యేమిటయ్యా.. మరీ నీళ్ళలా ఉంది?"
సర్వర్ : "అవి మంచినీళ్ళండీ ! కాఫీ ఇదిగో తెస్తున్నా !!"

128] మంగతాయారు : "మీ ఆయన నిన్ను వదిలేశాడటగా...? ఊరంతా అనుకుంటున్నారు."
అలివేలు : "ఎవరు అలా వాగింది? ఆ దరిద్రపు మొహమెవడు... ఉమ్మేసి తిను, చంపేస్తాను."
మంగతాయారు : "ఒకరని కాదు అలివేలూ! అంతా ఆ మాట అనుకుంటున్నారు."
అలివేలు : "నేనే మా ఆయన్ని వదిలేశాను."

129] టాంక్‌బండ్‌పైన తీరికగా కూర్చొని... దీర్ఘంగా ఆలోచిస్తున్న అహోబలరావుతో ముఖ పరిచయం గల ఒక వ్యక్తి వచ్చి... ఇలా అంటాడు.
వ్యక్తి : టైమెంతైందండీ ?"
అహోబలరావు : "వాచ్ లేదండి... కొనలేదు."
వ్యక్తి : "అంత ధనవంతులై యుండీ, వాచ్ లేదా ? చిత్రంగా ఉందే ??"
అహోబలరావు : "అప్పను మరి, వాచీ చేతికుంటే ప్రతి తలమాసిన వెధవా టైమడుగుతాడండి! అందుకే- కొనలేదు."

130] శంకరయ్య: "డాక్టర్‌గారూ! కడుపు నొప్పికి మీ రిచ్చిన మాత్ర వేసుకున్నా ఇంకా ఎక్కువైందే గాని... తగ్గలేదు."
డాక్టర్: "అదేంటయ్యా! నే నిచ్చింది కడుపునొప్పికే కదా!"
(ఫీజు ఇవ్వని విషయాన్ని మరోసారి జ్ఞాపకం చేసుకుంటూ)

131] ఈశ్వరమ్మగారింట్లో దొంగ చొరబడి... విలువైన నగలు, డబ్బు దో కెళ్ళారు. మర్నాడు... ఎదురింటి సులోచన వచ్చి ఇలా అంటుంది.
సులోచన: "రాత్రి గోచీ పెట్టుకున్న దొంగ రాస్కెల్... మీ ఇంటి గేట్ దూకడ నా కళ్ళారా చూశాను.
ఈశ్వరమ్మ (భోరుమని ఏడుస్తూ) : "అదేంటమ్మా! అలాంటప్పుడ కేకెయ్యకపోయావా? నా ఇల్లంతా గుల్లయ్యింది."
సులోచన: "మీ ఆయనేమో...? క్లబ్ నుండి వస్తున్నారేమో...?? బాగుండదని ఊరుకున్నా"

132] ఆఫీస్ నుండి రాగానే... భర్తకు భార్య ఒక స్టీల్ స్పూన్ చూపించి ఇల అంటుంది.
భార్య: "ఏమండీ! ఈ స్పూన్ ఎలా ఉంది? ఫ్రీగా ఇచ్చారు."
భర్త: "ఫ్రీగానా... చాలా చక్కగా ఉంది. మంచి డిజైన్. ఎవరిచ్చారు?"
భార్య: "స్టీల్ వాటర్ ఫిల్టర్ కొన్నాను. తొమ్మిది వందలు పెట్టి... ఇది ఫ్రీగా ఇచ్చార్లే"

133] కాబూలీవాలా : "ఏంది బే! తప్పించుకు తిరుగుతున్నావ్? బాకీ ఎప్పుడిస్తావ్??"
అప్పారావు: "ఒక వారం ఆగి కనపడవయ్యా!"
కాబూలీవాలా: "అప్పుడిస్తావా?"
అప్పారావు: "అచ్చే అదేం కాదు... ఎప్పుడిచ్చేది చెబుతాను."

134] కవిత: "ఏం కమలా! మీ పెళ్ళికి రాలేకపోయానే. మీ ఆయన ఎలాంటివాడే."
కమల: "మా ఆయన చాలా మంచివాడే. అన్ని అలవాట్లు మంచివే సిగరెట్ కాల్చరు, పేకాడరు, మద్యం త్రాగరు, వ్యభిచారం చెయ్యరు. కనీసం వక్కపొడి గాని, కిళ్ళీ అలవాటు గాని లేనే లేవే."

కవిత: "అయ్యో! అలాగా !? అంత చాదస్తపు మొగుడితో ఎలా కాపురం చేస్తున్నావే ?"

135] పల్లెటూరి అమాయకుడు: "టైమెంతైందండీ ?"

పట్నం దొర: "తొమ్మిదీ-పది అయింది బాబూ !"

పల్లెటూరి అమాయకుడు: "సరిగ్గా చెప్పండి తొమ్మిదా? పదా??"

136] పవన్: "మా నాన్న గొప్ప పేరున్న డాక్టర్ తెలుసా ? ఎన్నో వేలమందికి వైద్యం చేసి బ్రతికించారు."

కిరణ్: "మా నాన్నగారు కూడా ఇంకా పెద్ద పేరున్న డాక్టరే। వైద్యం చెయ్యకుండా కొన్ని లక్షలమందిని బ్రతికించారు."

137] సుబ్బలక్ష్మి: "పిన్నిగారూ। మాకు ఒక ముసలి పని మనిషి కావాలండీ!! మీకు తెలిసినవారెవరైనా ఉన్నారా ?"

తాయారు: "ఉన్నారు గానీ... మీ ఇంట్లో ఇప్పుడు పనిపిల్ల ఉందిగా?"

సుబ్బలక్ష్మి: "ఉంది లెండి పిన్నిగారూ। నేను పుట్టింటికి వెళ్ళేటప్పుడు దాన్ని తీసేసి ముసలిదాన్ని పెట్టుకోవడం నా కలవాటు !! లేకపోతే నా కొంప కొల్లేరు కాదూ...!"

138] ప్రియురాలు: "ప్రియా। ఇప్పుడు నాకు... ఐదో నెల తెలుసా...?"

ప్రియుడు: "జోకు లెయ్యకు డార్లింగ్। ఆడవాళ్ళకు వయస్సు తక్కువగా చెప్పుకోవడం సహజమేగానీ మరీ ఇంత ఘోరంగా చెప్పకూడదు. ఎవరూ నమ్మరు."

139] కాబూలీవాలా: "ఏంది చే। అప్పు తీసుకుని ఐదేళ్లైంది. రోజా తిప్పుతున్నావ్. ఏం తమాషాగా ఉందా ? ఈ రోజు ఇవ్వకపోతే చెయ్యి విరిచేస్తా."

అప్పారావు: "ఏ చెయ్యి.. ఎడమ చెయ్యా? కుడి చెయ్యా??"

కాబూలీవాలా: "ఏం తమాషాగా ఉందా? నిజంగానే విరిచేస్తా!" అంటూ చెయ్యి మెలితిప్పసాగాడు."

అప్పారావు: "ఆపవయ్యా బాబూ। ఆ చెయ్యి రెండొందల బాకీకి రిజర్వ్ ఐపోయింది."

140] గోపి ఇంట్లోనే ప్రైవేట్ చెప్పించుకుంటున్నాడు. మాష్టర్ వచ్చి క్లాస్ మొదలుపెడతాడు.

టీచర్: "ఒరే... గోపీ ?! పదమూడో ఎక్కం చెప్పరా !"

గోపి: (ఎక్కం అప్పచెబుతూ ఉండగా వంటింట్లో నుంచి తల్లి కేక.)

తల్లి: "ఒరే గోపీ ! ఏం చేస్తున్నావ్‌రా ?"

గోపి: "మాస్టారుకు పదమూడో ఎక్కం రాదట... చెబుతున్నా !"

141] సుబ్బరామయ్య: "ఒసేవ్ కాంతం ! నేను డాక్టర్‌గారి దగ్గరికి వెళుతున్నాను."

కాంతం: "సరిగా చూపించుకొని, మంచి మందు ఇమ్మనండి !"

సుబ్బరామయ్య: "అలాగేలేవే కాంతం !"

కాంతం: "అవునూ... అస్తమానం కళ్ళు తిరుగుతున్నాయన్నారు. గదీ సుగరుందేమో అడగండి డాక్టర్ గార్ని."

సుబ్బరామయ్య: "ఆ రేషన్ షాపువాణ్ణి బ్రతిమలాడుకొని మనమే ఎలాగో తెచ్చుకొందాంలెద్దూ! డాక్టర్‌గార్ని ఎందుకు అడగటం?"

142] ముఱుగులో దొర్లుతున్న పందిపిల్ల తల్లితో ఇలా అంటుంది ముక్కు మూసుకుంటూ...

పందిపిల్ల: "అమ్మా ! ఏమిటే ఈ దరిద్రపు వాసన ? ముక్కులు బద్దలైపోతున్నాయి. భరించ లేకుండా ఉన్నా."

తల్లి: "ఏం లేదులే... ప్రక్కనే సెంట్ ఫ్యాక్టరీ ఉంది. అది కారణం."

143] షాపు గుమాస్తా: "ఈ అమ్మాయికైతే.. గౌనులు కావాలిగాని చీర లెందుకండీ ?!"

అమ్మాయి తండ్రి: "మరేం ఫరవాలేదు లేవయ్యా ! ఈ అమ్మాయి సెలక్ట్ చేసుకునేసరికి చీరలే కావాలసి వస్తాయి."

144] రమణ: "ఏమిటి... మీ ఆఫీసర్ బాగా స్ట్రిక్టా ?"

మోహన్: "అవును! అంతా ఒకేసారి గాకుండా... వంతులవారీగా ఆఫీసులో నిద్రపోవాలని స్ట్రిక్ట్ ఆర్డర్స్ జారీ చేసాడు."

145] సేల్స్ ప్రమోటర్ : "ఈ పుస్తకం చదివితే... మీ ఆశయము సగం నెరవేరుతుందండీ !"
అప్పారావు : "అయితే... రెండివ్వండి !"

146] పేషెంట్: "డాక్టర్‌గారూ ! నాకు దగ్గరగా వున్న వస్తువులు కనిపించడం లేదండీ !!"
కంటి డాక్టర్ : "ఆ మాత్రానికే ఆందోళన ఎందుకు ? ఆ వస్తువుల్ని దూరంగా పెట్టి చూసుకుంటే సరి."

147] గంపెడు పిల్లలతో ఇబ్బంది పడుతూ... బస్ ఎక్కుతున్న మంగతాయారును చూసి కండక్టర్ అన్నాడు.
కండక్టర్ : "ఏమ్మా? ఇంతమంది పిల్లలతో కష్టపడే బదులు సగం మందిని ఇంటి దగ్గర వదలి రాకూడదూ ?"
మంగతాయారు : "అయ్యో పిచ్చి నాయనా!! నా కంత మాత్రం కూడా తెలీదనుకుంటున్నావా ? నేనిప్పుడు తీసుకొచ్చింది సగం మందినే బాబూ !"

148] యువకుడు: "మీ మాటల్ని బట్టి.. మీకు చావంటే భయం ఉన్నట్లు లేదే?"
వృద్ధుడు: "అబ్బే.. అదేం కాదోయ్! ఈ శాస్త్రజ్ఞులు చావు లేకుండా చేసే మార్గం కనిపెట్టేవరకు బ్రతకాలని ఉందోయ్!!"

149] మేనేజర్: "ఈ ఉద్యోగానికి చాలా బాధ్యతగల వ్యక్తి కావాలి."
దరఖాస్తుదారుడు: "నేనే అందుకు తగిన వాణ్ణండీ! ఇదివరకు నేనెక్కడ పనిచేసినా... ఏ పొరపాటు జరిగినా... నేనే బాధ్యుడనని నిర్ణయించారు కూడా."

150] నాలుగవ తరగతిలో ఆవును గురించిన విషయము చెప్పి.. "ఒరేయ్ వేణూ! నే చెప్పిన వాక్యాలు తప్ప.. ఇంకో మూడు వాక్యాలు స్వంతంగా చెప్పరా."
వేణు: 1] "ఆవు గ్రుడ్లు పెట్టదు, పొదగదు. 2] పక్షివలె పైకెగురలేదు. 3] మనిషివలె మాట్లాడటం చేతకాదు."

151] టీచర్: "ఉన్నది లేనట్లు.. లేనిది ఉన్నట్లు చెబితే... అది ఏ అలం మౌతుంది ?"
విద్యార్థి: "మయసభాలంకారము సార్ !"

152] భర్త: "భక్త తారకున జీతం పుచ్చుకొని జేబుదొంగ కొట్టేశాడని నీతో పేకాట, త్రాగుడుకు తగలేసిన పాపాత్ముణ్ణి" నన్ను క్షమించవూ?!
రాధ: "ఏమండీ! మీకు ఇవ్వమని చెప్పి మీ స్నేహితు డిచ్చిన నాలుగు రూపాయలతో మీకు చెప్పకుండా పట్టుచీర కొనుక్కున్న వంచకి నన్ను మీరు కూడా క్షమించరూ ?"

153] ఎకనమిక్స్ లెక్చరర్(పాఠం చెబుతూ): "శ్రమ విభజన అంటే ఒక ఒక్కరే చేయకుండా కొంతమంది కలిసి- ఒకరు ఒక భాగాన్ని, మరొ మరొక భాగాన్ని ఇలా తలా ఒక భాగమును చెయ్యడం అన్నమా తెలిసిందా..? (నిద్రపోతున్న పవన్‌కుమార్‌ని లేపి) శ్రమ విభజ ఉదాహరణ చెప్పు."
పవన్‌కుమార్: "ఉదాహరణకు మా బెంచీలో నలుగురము ఉన్నాం సా మీరు చెప్పిన పాఠాన్ని.. పావుగంట నేను, ఒక పావుగంట మోహన్, మ పావు గంట రమేష్.. ఇలా ఒక్కొక్కళ్ళం- శ్రమ విభజన చేసుకుం వింటున్నాం సార్."

154] ఆఫీస్‌కి అరగంట ఆలస్యంగా వచ్చాడు గుమాస్తా గుర్నాథం. ఆఫీ మండిపడి ఇలా అంటాడు.
ఆఫీసర్: "ఈ రోజెందుకు లేట్‌గా వచ్చావ్?"
గుర్నాథం: "మా ఆవిడ మేడమీద నుంచి జారిపడింది సార్ !"
ఆఫీసర్: "చాల్లేవయ్యా! మేడ మీద నుంచి పడటానికి అరగంటా?"

155] ఎవరో ఓ అపరిచితుడు వీధి గుమ్మంలో నుండి ఇలా కేకలేస్తూ పిలుస్తా ఇంటావిడని.
అపరిచితుడు: "అమ్మగారూ ! మగాళ్ళనెవరినైనా పిలవండి ! కొంచ పనుంది."
ఇంటావిడ: "మగాళ్ళెవరూ లేరు. అందరూ ఊరెళ్ళారు."

అపరిచితుడు: "పోనీ... ప్రక్క వాటా వాళ్ళెవరూ లేరా ?"
ఇంటావిడ: "లేరు... వాళ్లు కూడా ఊరికే వెళ్ళారు."
అపరిచితుడు: "దగ్గర్లో కూడా ఎవరూ లేరా?"
ఇంటావిడ: "లేరయ్యా! ఎన్నిసార్లు చెప్పాలి?"
అపరిచితుడు: "మీకు ఫోన్ ఉందా?"
ఇంటావిడ: "ఫోన్ కూడా లేదు. అసలు ఇంతకీ మీ రెవరూ...?"
అపరిచితుడు: "నేను దొంగని... ముందు నీ మెళ్ళో గొలుసు, నెక్లెస్, చేతి గాజులు త్వరగా తీయ్!" అంటూ లోపలికి వచ్చాడు కత్తితో.

156] బస్ యాక్సిడెంట్ కేస్ విచారణ జరుగుతోంది. ముద్దాయిగా బోనులో నిలబడ్డ డ్రైవర్‌తో జడ్జ్ ఇలా ప్రశ్నిస్తాడు.
జడ్జ్: "ఏమయ్యా డ్రైవరూ!? నువ్వు నడుపుతున్న బస్ అదుపు తప్పి పెదవడ్లపూడిలో పేరమ్మ అనే ఆడమనిషిని చంపింది అవునా...?"
డ్రైవర్: "అవునండీ! నిజమే !!"
జడ్జ్: "ప్రమాదం జరిగిన తరువాత జనం అరుస్తున్నా.. బస్ ఆపకుండా పొయ్యావట? ఇది ఎంత నేరమో నీకు తెలుసా ??"
డ్రైవర్: తెలుసండీ! ఐతే... నేను నడుపుతున్న బస్ నాన్‌స్టాప్ బస్సండీ !! పెదవడ్లపూడిలో ఆపకూడదు."

157] హోటల్ కెళ్ళి... ఇడ్లీకి ఆర్డరిచ్చాడు అవధాని! సర్వర్ ఇడ్లీ తెచ్చి ఇస్తాడు. ఇడ్లీ తింటూ... మధ్యలో ఏదో గుడ్డముక్కవంటిది వస్తే... సర్వర్‌ని కేక లేస్తున్నాడు...
అవధాని: "ఏమిటయ్యా సర్వర్ ఇది ?! గుడ్డముక్కవంటిది ఇడ్లీలో వస్తే... కళ్ళు మూసుకుపొయ్యాయా ?"
సర్వర్ (నిశితంగా పరిశీలించి) : "ఇది గుడ్డముక్కా? మీ కళ్ళు మూసుకుపొయ్యాయా??"
అవధాని: "ఐతే... గుడ్డముక్క కాదా ?"
సర్వర్: "కాదండీ బాబూ! చచ్చిపోయిన బల్లిని పట్టుకొని... గుడ్డ ముక్కంటున్నారు. అదిరి చచ్చేనంటే నమ్మండి!" (అంటూ లోపలికి వెళ్ళాడు.)

**158]** ప్యాసింజర్: "అబ్బ.. ఏం డ్రైవర్ బాబూ మీరు ? ఎంత అదిరో స్పీడ్‌లో వెళ్తుందో జీపు ! నువ్వు చాలా ఎక్స్‌పర్ట్‌లా ఉన్నావే...? భలే బ్రహ్మాండమైన థ్రిల్లింగ్‌గా ఉందంటే నమ్ము"
డ్రైవర్: "ఉండవయ్యా.. బ్రేకులు పడక నేనేడుస్తుంటే.. మధ్యలో నీ గోలేం

**159]** సేల్స్‌మాన్: "సార్ ! ఈ బనియన్ మీకు చాలాకాలం మన్నుతు గ్యారంటి నేనిస్తాను సార్ !!"
కస్టమర్: "ఎలా ? నమ్మకం ఏమిటి ??"
సేల్స్‌మాన్: "నేనే ఈ బనియన్‌ను మూడు నెలలు తొడిగా... కొత్త ఏమైనా పోయిందేమో చూడండి !"- అంటూ నాలిక్కొరుకు కుంటాడు.

**160]** జడ్జి: "చివరిగా నువ్వేమైనా చెప్పదలుచుకున్నావా ?"
ముద్దాయి: "నా తరఫున వాదించిన లాయర్ నిజంగా B.L. చదివా నాకు తెలియాలి ముందు..."

**161]** భార్య: "ముందు మన పనిమనిషిని- అర్జెంట్‌గా పనిలో ను తీసెయ్యండి!"
భర్త: "అదేంటే.. చక్కగా పనిచేస్తూ... చెప్పిన మాట వింటోందిగా ?
భార్య: "అందుక్కాదులే.... నా పేరు అప్పలమ్మ అయినప్పుడు... దాని అన్నపూర్ణ అనుండటం నాకేం బాగోలేదు."

**162]** నర్స్: "డాక్టర్‌గారూ ! ఇప్పుడొచ్చిన పేషెంట్‌కి ఏమేం టెస్ట్‌లు చెయ్యా
డాక్టర్: "ఆయన దగ్గర రెండొందలన్నీ పిండాలి. దానికి తగ్గట్టుగా చెయ్యి సిస్టర్ !"

**163]** భార్యాభర్తలు నిద్రపోతున్నపుడు అర్ధరాత్రి దొంగ ప్రవేశించి, భర్తని తాళాలు అడిగాడు కత్తితో బెదిరించి...
భర్త: "ఏం బాబూ? నువ్వు వృత్తికి కొత్త ఏమిటి??"
దొంగ: "అవును! ఎలా కనిపెట్టారు ?"
భర్త: "లేకపోతే... బీరువా తాళాలు ఎవరి దగ్గరుంటాయో కూడా తెలీకుం నన్ను లేపుతుంటేను."

164] అతిథి : "మీరు ఆపరేషన్ వద్దని చెప్పగానే డాక్టర్‌గారు కోప్పడ్డారా?"
రోగి : "లేదు! కాని... 'బ్రతకనేర్చిన వాడివంటూ అభినందించారు కూడా."

165] తండ్రి : "కమలా...! నామాట వినమ్మా...!! మూర్ఖంగా... ఆ మాణిక్యాలరావుని ప్రేమిస్తున్నావ్. అతనికి గుండె జబ్బు ఉన్నది."
కమల : "ఫర్లేదులే నాన్నా! అతను ఐదు లక్షలకు ఇన్సూర్ చేసారు."

166] భర్త : "ఒసే కాంతం! పంచదారేమిటి చేదుగా ఉంది? తెచ్చినప్పుడు బాగానే ఉందిగా!?"
భార్య : "ఏమీ లేదులే... చీమలు పడతాయని కొంచెము చీమల మందు పంచదార మీద చల్లానండీ! ప్రతిదీ చోద్యంగానే ఉంటుంది మీకు..."

167] బిచ్చగాడు : "అమ్మా! నీరసంగా ఉంది. రెండు రోజుల నుండి తిండి లేదు. బ్రతికి చెడ్డ వాడినమ్మా! ఏమైనా పెట్టమ్మా!!"
అన్నపూర్ణ : "ఇదిగో... ఈ ఐదు రూపాయలుంచుకో...! బ్రతికి చెడ్డవాడినంటున్నావు గదా? ఎందువలన ఇలా అయిపోయావు??"
బిచ్చగాడు : "ఏం చెప్పేదమ్మా! మీలాగే.. అడిగిన వాళ్ళందరికీ లేదనకుండా ధారాళంగా దానాలు చేసి ఇలా మారినమ్మా!!"

168] రాజ్యలక్ష్మి : "చూడు అప్పలమ్మా! రేపు మా అత్తమామా వస్తున్నారు. కూరలు, టిఫెన్‌లు వాళ్ళకు ఏవేవి ఇష్టమో... అవన్నీ లిస్ట్ వ్రాసాను. ఈ కాగితం జాగ్రత్తగా నీ దగ్గరుంచుకో!"
పనిమనిషి అప్పలమ్మ : "మంచి దమ్మగారూ! ఇందులోనివి ఏవి ఎప్పుడు చెయ్యమంటే.. అప్పుడు అవన్నీ- జాగ్రత్తగా, శుభ్రంగా, రుచిగా వండుతా నమ్మగారూ !!"
రాజ్యలక్ష్మి : "నీ తెలివి-తేటలు మండిపోనూ ! వాళ్ళు ఇక్కడున్నన్నాళ్ళు వీటిలోవి యేవి చేసినా... ఆ క్షణమే నీకు ఉద్వాసన ఇస్తాను జాగ్రత్త!"

169] కామిని : "ఏమే మేరీ! పెళ్ళెప్పుడు చేసుకుంటావే?"
మేరి : "పిల్లలు పుట్టకముందే చేసుకోవాలని నా అభిలాష!"

**170]** భర్త: "ఏమే శాంతి ?! సాయంత్రం మనింట్లో డిన్నర్‌కి మా ఫ్రెండ్స్‌నం ఆహ్వానించా గానీ... ముందా రేడియో, టేప్‌రికార్డరర్, ఇస్త్రీపెట్టె, మి టార్చ్‌లైట్ జాగ్రత్తగా దాచెయ్ !"

భార్య: "ఏం ? మీ ఫ్రెండ్స్‌కి దొంగబుద్ధులు ఉన్నాయేమిటండీ...? ఏమి కంగారు???"

భర్త: "అబ్బే అలాంటిదేమీ లేదుగానీ... వాళ్ళ వస్తువులు గదా...? గుర పట్టేస్తారేమోనని కంగారుగా ఉందిలే..."

**171]** అభ్యర్థి: "సార్! మీ ప్రకటనలో పెళ్లైనవారికే ఉద్యోగం ఇస్తామ ప్రకటించారు కారణం ఏమిటి ?"

మేనేజర్: "ఆ ! ఏం లేదు పెళ్లైనవాళ్ళయితే... నేను తిట్టే తిట్లకు ఏమి అనుకోరు. ఎందుకంటే... భార్య తిట్లకు, చివాట్లకు అలవాటు ప ఉంటారు గదా ?!"

**172]** సుబ్బలక్ష్మి: "హలో... డాక్టర్‌గారేనా ? మీరు వెంటనే రావాలి. మా వారి పిచ్చికుక్క కరిచింది."

డాక్టర్: "మీరేం కంగారు పడకండి! నే నిప్పుడే వస్తున్నాను. అంద మంచం మీదే పడుకోబెట్టండి!"

సుబ్బలక్ష్మి: "ఛీ ! ఛీ !! పిచ్చికుక్కని మంచం మీదెలా పడుకోబెడతారు డాక్టర్ ?!"

**173]** ఒక వ్యక్తి డైరీలో ఇలా వ్రాసుకున్నాడు... "నా జీవితము క్రమశిక్షణతో కూడినది. నేను త్రాగడము గాని, పొగ పీల్చడము గానీ... చేయను. క్లబ్‌లకు వెళ్ళను. నా భార్యను గౌరవిస్తాను. ఆమెను ఎప్పుడూ విసిగించడముగాని, వేధించడము గాని... చేయను. రాత్రి ఎనిమిది గంటలకే నిద్రపోయి, వేకువ జామునే లేస్తాను. నిర్ణీత వేళల్లో కష్టపడి పనిచేస్తాను. ఎక్సర్‌సైజ్ చేస్తాను. మితంగా భోజనం చేస్తాను. ఈ అలవాట్లన్నీ నన్ను జైల్‌లో ఉంచిన తరువాత అలవడ్డాయి."

174] జనాభా లెక్కలు తీసుకుంటున్న ఎన్యూమరేటర్... ఒక ఇంటికెళ్ళి ఆ ఇంటి స్త్రీ యజమానిని నడిగి వివరాలు సేకరిస్తాడు.
ఎన్యూమరేటర్: "మీకు వివాహం ఐందిగదా ?"
స్త్రీ: "అవును... ఐంది... రెండుసార్లు!"
ఎన్యూమరేటర్: "అందఱూ ఒకే భర్తకి కలిగారా ?"
స్త్రీ: "లేదండీ ! మొదటి భర్తకు ముగ్గురు, రెండవ భర్తకు ముగ్గురు, మిగిలిన ఇద్దరు నాకూ... !!"

175] రైతు రంగన్న: "నాకు కుడికాలు ఒక్కటే... నొప్పిగా ఉందండీ డాక్టర్‌గారూ ! నొప్పి భరించలేకుండా ఉన్నాను కాపాడాలి."
డాక్టర్: "పెద్ద జబ్బేం లేదులే! వయస్సు ముదరలా...? అందు కనిలే...!"
రైతు గంగన్న: "అది కాదు డాక్టర్‌గారూ ! నా రెండు కాళ్ళకు ఒక్కటే వయస్సు కదా? మరి ఎడమకాలు బాగానే ఉందిగా !"

176] గంగయ్య: "నేను రాత్రి ఓ బ్రహ్మాండమైన దొంగతనం చేశా !"
కన్నయ్య: "S.P. ఇంటిగ్గాని, కమీషనర్ ఇంటిగ్గాని కన్నం వేసావా ఏమిటి ?"
గంగయ్య: "లేదు... మా గురువుగారింటికి కన్నం వేసానులే !"

177] అప్పారావు: "ఏమయ్యా సేల్స్‌మేన్ ! ఈ టూత్ పేస్ట్ వాడితే నిజంగానే నోటిలోని సూక్ష్మక్రిములన్నీ చచ్చిపోతాయా...?"
సేల్స్‌మేన్: "అవునండీ... నిజంగానే ! ఈ పేస్ట్ దుర్వాసనకి నోట్లో ఉన్న ఎలాంటి క్రిములైనా ఇట్టే చచ్చిపోతాయి."

178] కామిని: "ఏయ్ సేల్స్‌మేన్! నాకీ బ్రా కరెక్ట్‌గా సరిపోతుం దంటావా ?"
సేల్స్‌మేన్: "సరిగ్గా సరిపోతుంది. కావాలంటే... అదిగో... నా భార్య అక్కడ నిల్చొని ఉంది. ఆవిడ అటు వెళ్ళగానే..."

79] మన్మథరావు: "నేనీ వాక్యం పూర్తి చేసిన క్షణంలో నువ్వొక పచ్చి అబద్ధం చెప్పగలిగితే... వందరూపాయ లిస్తాను."
వరహాలరావు: "అదేమిట్రా? వెయ్యి రూపాయలిస్తానని అంత లోనే వందకు తగ్గించావ్ !"

180] సుబ్బారావు : "రామారావ్! నువ్వేదో చాల పెద్ద మనిషి వనుకొని భ్ర
పడ్డాను."
రామారావు : "నేను కూడా అలాగే భ్రమ పడ్డాను. నువ్వు కూడా
మనిషివని!"
సుబ్బారావు : "నువ్వనుకున్నది రైటే! కానీ... నేనే పొరపడ్డాను."

181] పరంధామయ్య : "ఈ గేదె ఎవరిదయ్యా!? నీకు తెలుసా??"
దశరథరామయ్య : "గేదె సంగతి తెలియదుగానీ... దూడమాత్రం ఎవరి
చెప్పగలను."
పరంధామయ్య : "సరే! దూడ ఎవరిదో చెప్పు!!"
దశరథరామయ్య : "గేదెదే!"

182] భార్యతో నెహ్రూ జూలాజికల్ పార్కుకు వెళతాడు అవధాని! అక్కడ ఏనుగులన
పులులను, సింహాలను చూసిన తరువాత భార్య ఇలా అడుగుతుంది భర్త
భార్య : "ఏమండీ! ఉన్నట్టుండి హఠాత్తుగా ఏ పులో, సింహమో బోనుల
నుండి తప్పించుకొని మిమ్మల్ని తినేస్తే... నేను ఒక్కదాన్నే ఇంటికెళ్ళాలి కదా
మనింటికి ఏ నంబర్ బస్‌లో వెళ్ళాలో గుర్తు లేదు. చెప్పరూ!?"

183] భార్య: "అదేమిటండీ?! మీ పళ్ళన్నీ కట్టుడు పళ్ళా ? అప్పుడే అన్ని పళ్ళ
ఎలా ఊడిపోయాయండీ??"
భర్త : "ఇప్పుడు కాదులేవే! అవన్నీ నేను కాలేజీలో చదువుతున్నప్పుడు
ఊడిపోయాయిలే..." తాపీగా చెప్పాడు.

184] పోలీస్ : "ఇదేమిటయ్యా!? కార్ ఇక్కడ ఆపావు ?? ఇక్కడ కార్ పార్క్
చేస్తే... ఫైన్ చెల్లించాలి. బోర్డ్ చూడలేదా ఏమిటి ?"
కార్ యజమాని : "ఫైన్ ఫర్ పార్కింగ్ అని బోర్డ్ రాసి ఉంటే... పార్కింగ్‌కు
ప్రశాంతంగా ఉంటుందని ఆపాను."

185] కొత్తగా బదిలీపై వచ్చిన బ్యాంక్ ఆఫీసర్ ఒక వ్యక్తిని ఇలా ప్రశ్నిస్తాడు.
ఆఫీసర్ : "ఏమయ్యా? ఈ ఊర్లో వంటకి మనుషులు దొరుకుతారా?"
వ్యక్తి : "ఏమిటండీ !. వేళాకోళంగా ఉందా ? ఈ ఊర్లో వంటకి కూరగాయలే
దొరుకుతాయిగాని మనుషులు దొరకరు."

విద్యార్థి: "ఇంత పెద్ద లెక్క చేసినా... చివర్లో ఆన్సర్ జీరోయే వచ్చింది సర్!"
ఉపాధ్యాయుడు: "అవును! అది కరెక్ట్ ఆన్సరేగా?"
విద్యార్థి: "అది కాదండీ! కేవలం జీరో కోసం... ఇంతసేపు కష్టపడాలా?" అనడిగాడు.

వ్యక్తి: "డాక్టర్‌గారూ...! నా మనసంతా ఒకటే ఆందోళనగానూ, బెదురుగానూ ఉన్నది. మెదడంతా ఏదో గజిబిజిగా ఉందండీ! మీరే రక్షించాలి..."
డాక్టర్ (పరీక్షించి): "జబ్బేమీ లేదయ్యా! మానసిక ఒత్తిడి వలన అలా ఉన్నది. అందువలన నీవు ఈ వీధి చివర ఒక బఫూన్ ఉన్నాడు చూడు అతని దగ్గర ఒక గంటసేపు ఉండు! హాయిగా నవ్వుకోవచ్చు... అందువలన ఒత్తిడి తగ్గుతుంది."
వ్యక్తి: "నేనేనండీ బాబూ... ఆ బఫూన్‌ని!"

ఒక అమ్మాయి జ్యోతిష్యుడి దగ్గరకు వచ్చి... చెయ్యి చూపి ఇలా అడుగుతుంది.
అమ్మాయి: "నన్ను ఇద్దరు అబ్బాయిలు ప్రేమిస్తున్నారండీ...! అప్పారావు, సుబ్బారావులు- ఇద్దరూ మంచివారే! ఆస్తి గలవారు, అందగాళ్ళునూ!! వీళ్ళిద్దరిలో... నన్ను చేసుకునే అదృష్టవంతుడు ఎవరు?"
జ్యోతిష్యుడు: "అప్పారావు చేసుకుంటాడు గానీ... సుబ్బారావు అదృష్టవంతుడు!

వెంకటప్పయ్య: "ఏమయ్యా డ్రైవర్!? కంకటపాలెంలో బస్సాపకుండా వచ్చేసావు! నేనెక్కడ దిగాలి? కొంత ముందావే!"
డ్రైవర్: "కాస్త కునుకు తీసాలే! మీరైనా లేపకూడదూ?"

నీరజ: "రోజూ నన్ను 10 గంటలకి పొగిడేవారు మా వారు. నేనంటే ఎంత ప్రేమున్నా...? నేను లేందే ఆయనకి ఏమీ తోచదు."
స్నేహితురాలు: "అలాగా?! ఏమైనా నీవు అదృష్టవంతురాలివే నీరజా! భర్తని లొంగదీసుకున్నావు. పది కావస్తున్నది. మీ ఆయన నిన్ను పొగిడితే... విని వెళతా!"

నీరజ: "అలాగే...! విని వెళ్ళమన్నారని" (పది దాటింది)"
స్నేహితురాలు: "పది దాటింది. ఇంకా మాట్లాడడేమిటి ?"
నీరజ: "ఏదో అర్జెంట్ ఫైల్ చూస్తున్నట్లున్నారు. 11 గంటలకు పొగుడుతారు చూద్దువుగాని" ఇలా రెండ్రైనా... నోరు విప్ప లేదు భర్త! స్నేహితురాలు వెళ్ళిపోయింది.
నీరజ: "ఏమిటండీ మీ ప్రవర్తన ? రోజూ పదింటికి భలే పొగిడే వారు.... 'నీరజా! నీ ముక్కు సంపెంగ పువ్వు, నీ చెంపలు కెంపులు, నీ కళ్ళు కలువలు, నీ ముఖం చంద్రబింబం' అని ఈ రోజు అసలు పొగడలేదేమిటి ? నా ఫ్రెండ్ ముందు నన్ను అవమానించాలనా??"
భర్త: "అది కాదే... ఈ రోజు ఏ తారీకు? డిసెంబర్-31 కదా...?? ఈ రోజు నుండి ఒక నిర్ణయం తీసుకున్నా!"
నీరజ: "ఏమిటండీ ఆ నిర్ణయం ? త్వరగా చెప్పండి!"
భర్త: "ఆ ! ఏం లేదు... ఇక అబద్ధ మాడకూడదని!"

**191]** ప్రొఫెసర్: "ఏమండీ డాక్టర్‌గారు ?! నా నడుము పట్టుకు పోయింది. నిలబడుట సాధ్యం కావటము లేదు. ఎలాగైనా మీరే కాపాడాలి !"
డాక్టర్: "ఈ నడుము నొప్పి ఎప్పటి నుండి... ?"
ప్రొఫెసర్: "మార్నింగ్‌షో సినిమాకి వెళ్ళి మధ్యలో టాయ్‌లెట్ కెళ్ళినప్పటి నుండి డాక్టర్‌గారూ !"
డాక్టర్(పరీక్షించి, సరిచేసి): "ఇక నిలబడండి!"
ప్రొఫెసర్: "ఆహా ! భలే ఆశ్చర్యముగా ఉందే! అబ్బ మీ హస్తవాసి చాల గొప్పది. ఇదిగో ఫీజ్ ఈ రెండొందలు ఉంచండి ! క్షణాల్లో ఎలా తగ్గించారో చెప్పరూ !?"
డాక్టర్: "ఆ... ఏం లేదు. చొక్కా గుండీ పాంట్‌కు పెట్టుకుంటే ఇలాగే ఉంటుది మరి..."

**192]** డాక్టర్: "ఏమిటోయ్... నీకు గుండె లేదు. గుండె లేకుండా ఎలా బ్రతుకుతున్నావ్ ? అబ్బ... ఎంత అద్భుతము ?? ఆశ్చర్యము !?"
రోగి: "అదేమిటండీ డాక్టర్‌గారూ ?! గుండె లేదంటారు. ముందు స్టెతస్కోప్‌ని చెవులకి పెట్టుకోండి !"

193] అప్పారావు: "ఏమిటో రాజా ?! ఈ ఆడవాళ్ళకి డబ్బంటే లెక్క లేకుండా పోతోంది. డబ్బు లేమన్నా చెట్లకి కాస్తున్నాయనుకుంటారా?"
రాజు: "ఏమైందండీ!? ఎందుకంత విసుక్కుంటున్నారు ?"
అప్పారావు: "విసుక్కోక ఏం చేయమంటావ్ మరి! నా పుట్టినరోజుకి నాలుగొందలు అడిగింది. దాని పుట్టినరోజుకి ఐదు వందలు, పిల్లల పుట్టినోజుకి మూడు వందలు అడిగింది. డబ్బంటే... అస్సలు లెక్కలేదు."
రాజు: "ఇంతకీ ఆ డబ్బంతా ఏం చేస్తుందంటావ్ ?"
అప్పారావు: "ఇంతకూ నేనిస్తేగా తెలిసేది.....!"

194] రోగి: "డాక్టర్‌గారూ! నాకు చాలా భయముగా ఉందండీ! ఇది నాకు మొదటి ఆపరేషన్ !!"
డాక్టర్: "నాకూ మొదటి ఆపరేషనే లేవయ్యా! అందుకే నేనూ వాడిపోతున్నా!!"

195] అమల: "నన్ను ప్రేమించానంటూ మజ్నులాగా ఫోజ్ పెట్టి 'బ్రతికితే నీతోనే... లేకుంటే చావడమే' అనేవాడివి కదా...! మరిప్పుడు పద్మినిని ఎలా కట్టుకున్నావ్... ?"
సూర్యం: "నిన్ను ప్రేమించినమాట నిజం...! బ్రతికితే నీతోనే అన్నమాట అంతకన్నా నిజం...!! అందుకనే పద్మినిని కట్టుకుని చస్తున్నా!!!"

196] డాక్టర్: "ఏమే రాణీ! నేను ఛార్జ్ తీసుకున్నాక... ఈ ఆస్పత్రికి నిరుడు నాలుగొందలమంది రోగులు వచ్చారు. ఈ యేడాది మూడువందల మంది రోగులే వచ్చారు. అంటే... నేను వచ్చాక... నూటుగురు రోగులు తగ్గారన్నమాట?!"
భార్య: "చాల్లే ఊరుకోండి! ఈ మాట నాతో అన్నారు కాబట్టి... సరిపోయింది. ఇంకెవరితోనన్నా అంటే... వందమందిని పొట్టన కట్టుకున్నారనుకుంటారు. జాగ్రత్త !"

**197]** పనిమనిషి: "అయ్యగారూ ! నేనీ ఇంట్లో నౌకరీ చేయలేను. నాకు సెలవిప్పించండి!"
యజమాని: "ఏం ? ఏమైంది ?? అమ్మగారేమైనా అన్నదా??? అంత కోప్పడతావెందుకు ????"
పనిమనిషి: "కోపము రాక ఏమౌతుందండి!? నేను మీ ఇంట్లో పని చెయ్యటానికి వచ్చానుగాని మాట పడ్డానికి కాదు. అమ్మగారు మిమ్మల్ని సాధించినట్లుగా నన్ను సాధిస్తే పడడానికి.. నాకేం కర్మ కాలిందండీ!? నాకు మాత్రము సిగ్గు, శరము, మానాభిమానాలు లేవా??"

**198]** కొత్తగా రాజకీయాల్లోకి దిగి, మంత్రి పదవి పొందిన వెంకయ్యని ఆ ఊరి మాజీ జమిందార్ ఐన రాజా రవిచంద్ర హేళన చేద్దామని ఇలా అన్నాడు.
రాజా రవిచంద్ర: "మా తాత ముత్తాతలు ఎంతో పేరు-ప్రతిష్ఠలు గలవారు! మా వంశము జమిందారుల వంశము!! చాల గొప్ప వంశము!!! మరి మీ వంశము ?"
వెంకయ్య: "మీ వంశము గొప్ప మీతో ఆగిపోయింది. కాని... మా వంశ గొప్పతనము నాతో ప్రారంభమయ్యింది."

**199]** లాయర్: "నీ కేస్ వాదించడానికి ఒప్పుకుంటే నాకే మివ్వగలవు? నిన్ను చూస్తే గిట్టుబాటయ్యేటట్లు లేదు."
పార్టీ: "అలా అనకండి సార్! ఎంతో కొంత సమర్పించుకుంటాను. డబ్బు మాత్రము ఇవ్వలేను గాని... తమరికి ఈ బంగారు గొలుసులో ఒక పేట సమర్పించుకుంటాను."
లాయర్: "అలాగైతే నా కెలాంటి అభ్యంతరము లేదు. ఇంతకీ నీ మీద కేస్ ఏమని పెట్టారయ్యా?"
పార్టీ: "ఈ గొలుసు కాజేసానని !"

**200]** ప్రియుడు: "నేను మీ అంతస్తుకు సరితూగలేను... ఒప్పుకుంటా ! కాని... నా ప్రేమ చాలా పవిత్రమైనది. చాలా గాఢమైనది. నన్ను నీవు పెళ్ళి చేసికోవడానికి అంగీకరించకపోతే వెంటనే నేను ఈ చెఱువులో పడి చచ్చిపోతాను."

ప్రియురాలు: "ఇది ఎండాకాలము కదా? చెరువు పూర్తిగా ఎండిపోయింది. ఒక చుక్క కూడా నీళ్ళు లేవు."
ప్రియుడు: "ఐతే వానాకాలము వచ్చేదాకా ఆగుతాను."

201] ఫ్లోర్‌బాయ్: "హీరోయిన్‌గారు కోపముగా ఉన్నా రెందుకండీ!?"
మేకప్‌మాన్: "ఆవిడ నటిస్తున్న సినిమాలోని పాత్ర పేరు... అప్పలమ్మట!"
ఫ్లోర్‌బాయ్: "అంతమాత్రానికే కోపమెందుకండీ!?"
మేకప్‌మాన్: "ఆవిడగారి నిజమైన పేరు కూడా అప్పలమ్మేనట మరి !"

202] సుజాత: "ప్రఖ్యాత హీరోయిన్ జయప్రభ నీకు తెలుసటగా ?"
విమల: "తెలియక పోవడ మేమిటి...? మేమిద్దరమూ మంచి స్నేహితులము కూడా...! చిన్నప్పుడు వాళ్ళు మా ఇంటిలోనే అద్దెకుండేవారు. మా ఇద్దరిదీ ఒకటే వయస్సు ! నాకేమో ఇప్పుడు నలభై రెండు !! ఆవిడకేమో పందొమ్మిది జరుగుతుంది."

203] డాక్టర్: "మీ అమ్మాయికి జబ్బేమి లేదండీ! పెళ్ళి చేసేస్తే సగం జబ్బు తగ్గిపోయినట్లే!"
అవతారం: "ఐతే మా అమ్మాయికి రెండు పెళ్ళిళ్ళు చేసేస్తే జబ్బు పూర్తిగా తగ్గుతుంది డాక్టర్!?"

204] మోహన్: "మా మేనేజర్‌కు ఎప్పుడూ ఇంటి జ్ఞాపకమే!"
ప్రసాద్: "ఏమైందేమిటి ?"
మోహన్: "ఆఫీస్‌లో భోజనాలైన తరువాత... ఆయన క్యారేజ్‌తో పాటు మా అందరి క్యారేజ్‌లను కూడా తోమి, కడిగి పెడుతున్నారు."

205] రామారావు: "నీ బ్లూ కలర్ డ్రాయర్ చాల బాగుందిరా! ఎల్లోని బోర్డర్ దాని అందాన్ని ఇనుమడింప చేస్తోంది."
అప్పారావు: "భలే ఆశ్చర్యముగా ఉందే...! నేను బ్లూ డ్రాయర్ తొడుక్కున్నట్లు నీకెలా తెలుసు ?"
రామారావు: "ఆఁ ఏముంది...?! నువ్వు ప్యాంట్ తొడుక్కోవడము మరిచి పోయావులే !"

206] తల్లి(వంటింట్లోంచి) : "అబ్బా! గోల భరించలేకుండా ఉంది. ఎందుకురా వేణూ? చంటిదాన్ని అలా ఏడిపిస్తావు?. దానికావలసిందేదో ఇచ్చెయ్యరాదూ."
వేణు : "అది అడిగిందే ఇచ్చానమ్మా అందుకే ఏడుస్తోంది."
తల్లి : "ఏమిచ్చావురా ?"
వేణు : "మిరపకాయ."

207] రంగారావు : "టైఫాయిడ్‌తో హాస్పిటల్‌లో చేరిన నన్ను డాక్టర్ పది రోజుల్లో నడిపిస్తానని చెప్పి... ఆ మాట నిలబెట్టుకున్నాడు."
ధర్మారావు : "ఓహో ! అలాగా ? అంటే... ఇప్పుడు బాగా నడవ గలుగుతున్నావన్నమాట?"
రంగారావు : "నడవక చస్తానా చెప్పు? డాక్టర్ ఫీజ్ కోసము స్కూటర్ని అమ్మేసాను మరి !"

208] తల్లి : "బాబూ ! ఈ రోజు నీ పదహారో పుట్టినరోజు!! ఒక్క విషయము గుర్తుంచుకో... వయసొచ్చే కొద్దీ స్నేహితులు ఎక్కువై సిగరెట్లు, త్రాగుడు లాంటి చెడ్డ అలవాట్లు వస్తాయి. జాగ్రత్త నాయనా !"
కొడుకు : "నువ్వేం దిగులు పడకమ్మా త్రాగుడు, సిగరెట్లు మానేసి రెండేళ్ళయింది."

209] రామనాథం : "బాబూ ! నువ్వు రాజారావుగారబ్బాయివి కదూ? ఏమిటి ఈ కొట్లో సిగరెట్లు కొంటున్నావు ? నిండా ఏడేళ్ళు లేవు. అప్పుడే సిగరెట్లు కాలుస్తున్నావా ?"
అబ్బాయి : "అబ్బే! నాక్కాదండీ... మా తమ్ముడికి!"

210] ఒక వ్యక్తి లాయర్ దగ్గరికెళ్ళి ఇలా వాపోతాడు.
వ్యక్తి : "అయ్యా లాయర్‌గారూ ! నాకు ప్రతిరోజూ బెదిరింపు ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. ఇది చట్టవిరుద్ధం కాదా?"
లాయర్ : "అవును... ఇది చట్ట వ్యతిరేకమే! ఇంతకీ అవి ఎవరు వ్రాస్తున్నారు ?"
వ్యక్తి : "నా ప్రియురాలి భర్తండీ !"

211] భార్య: "నే నేమంటానో అని భయపడి రాత్రంతా ఈ పులి బోనులో పడుకున్నావా ? రా ! నీ పని చెప్తా!!"
భర్త: "నేను రాను. నాకు భయము! ఈ పులి ప్రక్కనే పడుకుంటా!!"

212] వీరయ్య: "అబ్బ నీతో మాట్లాడిన ఈ నాలుగ్గంటలూ క్షణాల్లాగా దొర్లిపోయాయి. నీతో మాట్లాడటము వలన నా తలనొప్పి పూర్తిగా పోయింది."
పేరయ్య: "తలనొప్పి ఎక్కడికీ పోలా...! నీ దగ్గర నుంచి నాకు వచ్చిందంతే!!"

213] భార్య: "ఏమండీ... నేనింకా ఎక్కువ కాలము బ్రతికే అవకాశము లేదన్నారు డాక్టర్! నేనంటే మీకు ఎంతో అభిమానమన్నారు కదా?! నేను చచ్చిపోతే... మళ్ళీ పెళ్ళి చేసుకుంటారా?"
భర్త: "లేదు నాకలాంటి ఆలోచనేరాదు."
భార్య: "ఒకవేళ పెళ్ళైతే ఆవిడను నా నగలు పెట్టుకోనియకండి!"
భర్త: "అలాగే ! ఐనా నీ పాత నగలు దానికి నచ్చుతాయా అని?!"

214] అప్పిశెట్టి : "మా కొట్లో బేరాలు బ్రహ్మాండముగా సాగుతున్నాయి. రాత్రింబవళ్ళు ఒక్కటే బేరాలు ఉండుట వలన... తలుపులు మూయ్యడమే మానేసామంటే నమ్మండి!"
సుబ్బిశెట్టి : "మీ దుకాణములో కన్నె మా దుకాణములో ఇంకా ఎక్కువ రద్దీగా ఉంది. అందుకని నేను తలుపులను తీయించి పొయ్యిలో పెట్టించేసాను మరి."

215] సుబ్బలక్ష్మి: "డాక్టర్‌గారూ ! మా ఆయన నిద్రలో మాట్లాడుతూ ఉంటారండీ!!"
డాక్టర్ : "అలాగా...! ఐతే మాట్లాడకుండా నిద్రపోవడానికి మందు ఇస్తాను."
సుబ్బలక్ష్మి : "అటా ! అలాగ్గాదు... ఆ మాట్లాడేదేదో అర్థమయ్యేలా మాట్లాడుటకు మందు ఇవ్వండి ! మీకు పుణ్య మంటుంది!!!"

216] మంచి, మానవత్వము మరిచి; పాపారావు లక్షలు సంపాదించాడు. ఫ్యాక్టరీలను కట్టించాడు. నగ-నట్రా విపరీతముగానే కొన్నాడు. దాంతోపాటే భగవంతుని కూడా మరిచి పోయాడు. ఒకరోజు తన పాత మిత్రుడు రామశాస్త్రితో ఇలా అంటాడు పాపారావు.

పాపారావు: "ఈ ఆస్తంతా నేను నా తెలివి-తేటలతోను, శక్తి-యుక్తులతోనూ సంపాదించినదే! ఈ అదృష్టానికి ఎవ్వరూ కారణము కాదు."
రామశాస్త్రి: "మిమ్మల్ని భగవంతుడు మెచ్చుతాడు."
పాపారావు: "మధ్యలో భగవంతుడు మెచ్చడ మెందుకు ?"
రామశాస్త్రి: "మీ అదృష్టానికి 'భగవంతుడు కారణము' అని మీరు చెప్పకోనందుకు !"

217] కొత్తగా ప్రారంభించిన బట్టల దుకాణము ముందు ఒక బిచ్చగాడు పాటలు పాడుతూ ఉన్నాడు. అది విని జనము భరించలేక... ఆ షాప్‌కి ఎవరూ రావటము లేదు. అప్పుడు...
షాప్ ఓనర్: "ఏమయ్యా! నీ పాటల వలన మా షాప్‌కు ఎవరూ రావడము లేదు. అదిగో! ఆ చెట్టు-దగ్గర కూర్చుని పాడుకుంటే... రోజుకి పది రూపాయ లిస్తా!!"
బిచ్చగాడు: "అచ్చే! లాభము లేదండీ !! నాకెంతో నష్టము... ఆ లక్ష్మీ వస్త్రాలయము వారు ఇక్కడ కూర్చుని పాడుతున్నందుకు పాతిక రూపాయ లిస్తున్నారు."

218] ప్రొడ్యూసర్: "అర్జెంట్‌గా మనకు తండ్రి పాత్రకు సరిపోయే నటుడు కావాలి."
డైరెక్టర్: "అంత వెదుకవలసిన పనేమీ లేదండీ! మన హీరోగారికి మేకప్ తీసేస్తే సరిపోతుందిగా !"

219] అలివేలు: "ఇదిగో మంగమ్మా! చాకిరేవులో నా చీరలన్నీ చక్కగా ఉతికి తీసుకురా !! ఒక్కమాట... నేను కట్టేటన్ని చీరలు ఇంకెవరైనా కట్టగలరా? రోజుకి ఓ చీర కడతాను తెలుసా??"
మంగమ్మ: "రోజుకు ఒక చీర కట్టే మీరే అలాగంటే... నాలుగైదు చీరలు కట్టే నేనేమనుకోవాలి?"

220] ప్రియుడు: "రాణీ! నిన్ను తప్ప నేనెవర్నీ పెళ్ళి చేసుకోలేను. నా మాట నమ్ము.. నెల తప్పావని చింతించకు! ఇంతకు ముందు రమణి, గీత, మేరీ, రాజ్యము, కమల, రీటాలకు ఇలాగే చెప్పాను. వాళ్ళంతా నమ్మారు. నువ్వు నమ్మకపోతే ఎలా... ?"

రాణి: "అలాగా...?!" (అని మూర్ఛపోతుంది.)

221] సుబ్బారావు: "డాక్టర్ రామారావుగారూ! మతిమరుపుకు మీరిచ్చిన మందు బ్రహ్మాండముగా పనిచేస్తోందండీ!!"

డాక్టర్: "ఓహో! అలాగా...? ఐతే ఇంకొన్నాళ్ళు ఆ మందు వాడండి!"

సుబ్బారావు: "ఎందుకుసార్! తగ్గిపోయింది కదా?!"

డాక్టర్: "నేను డాక్టర్ రామారావుని కాదు... డాక్టర్ పశుపతిని! పశువుల డాక్టర్ని తెలుసా...?"

222] మిఠాయి షాప్‌కు ఒక గొప్ప పిసినారి తన భార్యను తీసుకొని వస్తాడు.

పిసినారి: "ఏమే కాంతం! ఇంకో మైసూర్‌పాక్ ముక్క తింటావేమిటే?"

భార్య: "ఇంకొకటేమిటండీ?! అసలు నేను మైసూర్‌పాక్ ముక్క ఒక్కటి కూడా తినందే ?"

పిసినారి (కోపముగా): "ఆహ్హ.. అంత మతిమరుపైతే ఎలాగే ? మన పెళ్ళైన కొత్తలో సిటీకి వచ్చినపుడు ఇదే షాప్‌లో మైసూర్‌పాక్ ముక్క ఇప్పించలేదేమిటే...? ఆఁ...!"

223] బాటసారి: "ఎందుకమ్మా...! రోడ్డుమీద కూర్చుని ఏడుస్తున్నావు? తప్పిపోయావా??"

అమ్మాయి: "అబ్బే! అదేం లేదండీ!! మా అమ్మ నాన్న తప్పిపోయారండీ!!!"

224] బాలుడు (పక్కింటి రాజేష్‌తో): "నిన్న మా అక్కని కౌగిలించుకున్నావ్! నేను చూశాలే!!"

రాజేష్: "ష! గట్టిగా అరవకు!! ఇదిగో ఈ పది రూపాయలు తీసుకో!!!"

బాలుడు: "పది వద్దు! ఐదే చాలు!! నేను అందరి వద్ద ఐదే తీసుకుంటున్నాను. ఎక్కువ తీసుకోను."

**225]** పోలీస్ పుల్లారావు పబ్లిక్ బూత్‌నుంచి స్టేషన్‌కి ఫోన్‌చేస్తూ... ఇలా అంటాడు
పుల్లారావు: "S.I. గారూ! నా కళ్ళెదురుగా లూటీ జరిగింది. అందులో ఒకడ్ని పట్టుకున్నాను."
S.I. : "వెంటనే వాడ్ని స్టేషన్‌కి ఈడ్చుకురా! నిజాన్ని కక్కిద్దాం!!"
పుల్లారావు : "లూటీలో సొమ్ము కొట్టేసుకున్నది వాడే సార్!"

**226]** టీచర్: "గాడిదకు మాత్రమే ఉండి... మిగతా జంతువులకు లేని దేమిటో చెప్పండి చూద్దాం!?"
ఒక విద్యార్థి: "గాడిదపిల్ల సార్!"

**227]** టూరిస్ట్ : "ఏమండీ?! తాతయ్యగారూ ! మీ నగరంలో దొంగతనాలు దోపిడీలు, స్మగ్లింగ్, దొంగ సారా వ్యాపారం, అమ్మాయిల వ్యాపారం ఎక్కువగా జరుగుతుంటాయా?"
తాతయ్య : "అరే మీకెలా తెల్సు ? మీరు ఈ ఊరికి కొత్తకదా??"
టూరిస్ట్ : "ఆ...! ఏం లేదు... పోలీస్ కానిస్టేబుల్స్‌కు కూడా స్వంత మారుతీకార్‌లు ఉంటేనూ...?"

**228]** తండ్రీ-కొడుకులు మానసిక రుగ్మతల డాక్టర్ (సైక్రియాటిస్ట్) దగ్గరకు వచ్చి తమ సమస్యలను వివరిస్తూ ఇలా...
తండ్రి : "డాక్టర్‌గారూ! మావాడు నిద్రలో లేచి నడుస్తున్నాడండీ!! మీరే పరిష్కరించాలి."
డాక్టర్ : "ఆ...! ఇదో పెద్ద సమస్యేనా ? నాలుగు తగిలించి పండుకోబెట్టక... నా దగ్గరికెందుకొచ్చారయ్యా??"

**229]** తండ్రి: "ఏమండీ మాస్టర్‌గారూ?! మా చంటాడికి ఏం నేర్పారు ?"
టీచర్ : "మీ వాడికి ప్రస్తుతానికి గోడకుర్చీ వెయ్యడము, గుంజిళ్ళు తియ్యడము వచ్చాయి. ఈ రోజు నుంచి మా ఇంట్లో పనులకు ట్రైనింగ్ ఇస్తున్నాను.... ఆ.... కాదు కాదు.. ABCDలు నేర్పుతున్నా!"

230] అప్పారావు: "డాక్టర్‌గారూ...! మీరు హాబీగా ఫోటోలను కూడా తీస్తుంటారా ?"
డాక్టర్: "అవును... అంత కచ్చితంగా మీరెలా కనిపెట్టారు ?"
అప్పారావు : "మీరు ఇంజక్షన్ చేస్తున్నప్పుడు 'స్మైల్ ప్లీజ్' అన్నారుగా దాన్నిబట్టి చెప్తున్నా!"

231] రోగి: "డాక్టర్‌గారూ...! ఈ టానిక్‌ని పడుకోబోయే ముందు త్రాగమన్నారు గదా!! ఆఫీస్‌లోనా?...... ఇంట్లోనా??"

232] అక్క: "ఏరా తమ్ముడూ?! ఎక్కడికి పరిగెత్తుతున్నావ్?"
తమ్ముడు: "అందమైన పైన చంద్రగ్రహణం చూస్తున్నారక్కా! నేను కూడా చూడ్డానికి వెళుతున్నా!!"
అక్క: "మరీ దగ్గరకు వెళ్ళి చూడకు! కాస్తంత దూరముగా ఉండి చూడు!!"

233] బార్‌లో మందుకొడ్తూ కన్పించిన తన స్నేహితున్తో అప్పారావు....
అప్పారావు: "అదేమిటి ? నిన్ననేగా మందు త్రాగనని భీకర ప్రతిజ్ఞ చేసావ్. అప్పుడే త్రాగుతున్నావు!"
దేవదాసు: "మానెయ్యటం సంగతి నిజమేరా... ఐతే... మరీ ఏ మాటంటే ఆ మాటే పట్టుకొని మొండిగా వ్రేలాడే మూర్ఖుణ్ణి మాత్రం కాదురా నేను!"

234] పిల్లితో అల్లుకుపోయిన ప్రొఫెసర్ జీవితం భార్యకు లోకువై పోయింది. ఒకరోజు రాత్రి ప్రొఫెసర్‌గారు... ఏదో వ్రాసుకుంటూ ఉండగా... పాలగ్లాస్ తెచ్చి ప్రొఫెసర్ ప్రక్కన ఉంచి... "త్రాగమ"ని చెప్పి నిద్రపోయింది భార్య. ఒక పావుగంట తరువాత చూస్తే... గ్లాస్ ఖాళీగా ఉంది. పిల్లిని చూస్తే గాఢనిద్ర పోతున్నది. మరి పాలేమయ్యాయో అర్థంకాక... భార్యని లేపి... అడుగుతాడు. భార్య "పిల్లి త్రాగి ఉంటుంద"ని చెబుతుంది.
ప్రొఫెసర్: "లేదే... అది నిద్దురపోతోంది. అయినా దాన్ని తూకం వేస్తే... అసలు విషయం తెలిసిపోతుంది. మన పిల్లి ఎంత బరువు ఉండొచ్చు ?"
భార్య: "అరకిలో వరకు ఉండొచ్చండీ!"
ప్రొఫెసర్: "మరి పాలు ?"

భార్య: "అది కూడా లరకిలో తూగవచ్చండీ!"

తూకం వేస్తే పిల్లి అరకిలో తూగింది. వెంటనే అనుమాన మెుల్చి ప్రొఫెస భార్యని ఈ ప్రశ్న వేస్తాడు. "దీని బరువు అరకిలో పాలకి సరిపోయి దనుకో! మరి పిల్లి ఏమైనట్లు ?"

235] సుబ్బలక్ష్మి: "పనిమనిషి మీద అనుమానముగా ఉందంటున్నావు ? ఎందు రాజ్యలక్ష్మి??".

రాజ్యలక్ష్మి: "ఇంతకు ముందైతే 'ఏమిటి అమ్మగారూ' అని పలుకరించేది ఇప్పుడు 'ఏమిటక్కా' అని పలుకరిస్తుంటేనూ..."

236] తండ్రి: "ఏరా రాజా?! పరీక్ష బాగ వ్రాసావ్?"

కుమారుడు : "అద్భుతంగా వ్రాసాను నాన్నా ! కనీసం పాస్ మార్క్ లన్న వస్తాయనే నమ్మకం కొద్దిగా ఉంది."

237] రాజు : "ఓ భగవంతుడా ! నువ్వే గనుక నిజంగా ఉండి ఉంటే. ఇండియాకు బొంబాయిని రాజధానిగా చెయ్యాలి. క్విక్ చాలా అర్జంట్ స్వామి!

తల్లి: "ఒరే రాజు! అదేమిట్రా నీకు నిజంగా పిచ్చి పట్టిందా? బొంబాయిని రాజధానిగా చేయడ మేమిటి??"

రాజు : "అవునమ్మా.. ఏం చేయను? పొద్దుటి పరీక్షల్లో అదే వ్రాసాను మరి..."

238] పోలీస్ స్టేషన్‌కి రెండు నెమిళ్ళను తీసికొచ్చాడు వరహాలరావు.

వరహాలరావు : "ఇదిగో సార్ ! ఇవి రోడ్డు ప్రక్కన తిరుగుతుంటే పట్టుకొచ్చాను. ఏం చేయమంటారు ?"

పోలీస్: "జూకి తీసికెళ్ళవయ్యా"

మర్నాడు మళ్ళీ అవే నెమిళ్ళను తీసికొని స్టేషన్ కొచ్చాడు మన వరహాలరావు.

పోలీస్: "ఏమయ్యా..? పెద్ద మనిషీ..! నిన్న వీటిని జూకి తీసి కెళ్ళమని చెప్పానుకదా !? మళ్ళీ ఇక్కడికెందుకొచ్చావ్??"

వరహాలరావు : "అవును సార్ ! నిన్న జూకి తీసుకెళ్ళాను. అంతా చూపించాను. మరి ఇవాళ సినిమాకి తీసికెళ్ళమంటారా ?"

**239]** గోపాల్ నుంచి పెన్ లాక్కున్న రాముతో ఇలా అంటుంది వాళ్ళమ్మ...
తల్లి : "చూడు రామూ! నువ్వు ఇంకా చిన్న పిల్లాడివి కాదు. అలా తగవులాడ్డం మంచిది కాదు. ఎవరి దగ్గరన్నా తీసుకునేటప్పుడు ఇవ్వడం కూడా నేర్చుకోవాలి.
రాము: "ఆ మాత్రం నాకూ తెలుసునమ్మా! అందుకే వాడికో లెంపకాయ ఇచ్చాకే పెన్ను తీసుకున్నా మరి."

**240]** తల్లి: "ఒరే రాజా! ఈ డబ్బాలో రెండు లడ్లు పెట్టాను. ఒకటే ఉందేమిట్రా ?"
కుమారుడు : "అయ్యో! రెండున్నాయా ? రాత్రి చీకట్లో ఒకటే అనుకున్నానే..."

**241]** టీచర్: "ఒరే రాజా! 'శుభ్రముగా' అనే మాటను ఉపయోగించి ఒక వాక్యం చెప్పరా!!"
రాజు : "మీరు శుభ్రంగా పళ్ళను తోముకోవాలి మాస్టారూ !"

**242]** రాజారావు: "అయ్యా! డాక్టర్‌గారూ !! మా ఆవిడను కుక్క కరిచింది. మీరే రక్షించాలి..."
డాక్టర్: "ఏం ఫరవాలేదు. ఇంతకీ కరిచిన కుక్క పిచ్చిదా ? మంచిదా ??"
రాజారావు: "దాని మొహంనికి మంచి కుక్కకూడానా...? అది కచ్చితంగా పిచ్చికుక్కే అయ్యుంటుంది..."

**243]** **ఆ స్టేషన్ పేరు నీకెందుకురా ? :-** ఒక కుటుంబం రైల్లో ప్రయాణం చేస్తూ ఉంటుంది. ఆ కుటుంబంలో... భార్య భర్త ఇద్దరు మగ పిల్లలు, నలుగురు ఆడపిల్లలు ఉంటారు. ప్రయాణంలో ఎన్నో స్టేషన్లు దాటిపోతూ ఉంటాయి. ఒక స్టేషన్ దాటిపోతూ ఉండగా...
"అమ్మా! ఈ స్టేషన్ గాక దీనికి ముందు దాటిపోయిన స్టేషన్ పేరేమిటే ?" అడిగాడు పెద్ద కుమారుడు.
తల్లి : "ఏమోరా ? నాకు తెలియదు. ఐనా... ఆ స్టేషన్ పేరు నీ కెందుకురా ?"
పెద్ద కుమారుడు : "ఆఁ ఏం లేదు... ఊరకే అడిగానులే! ఆ స్టేషన్‌లో చిన్న చెల్లాయి దిగిపోయేను."

244] మీ వలన :– సుబ్బలక్ష్మి: "తమ్మయ్యో మాకు ఇప్పుడు ఏ గొడవా లేకు
ఉంది. ఇరుగు-పొరుగు హాయిగా-ప్రశాంతంగా ఉందంటే నమ్మం
అలివేలు: "అలాగా?! ఐతే మీరు కూడా ఇల్లు మారారన్నమాట."
సుబ్బలక్ష్మి: "అబ్బే! అదేం లేదు. మేము ఇల్లు మారలేదు. మీ
మారారు కదా?!"

245] కమల: "ఏమండీ! పిండివంటలు భలే కుదిరాయి. ఒక్కటి రు
చూద్దురూ!!"
కమల భర్త: "వద్దులే కమలా...! నిన్న పక్కింటి విమల నిన్ను అవమానిం
కొట్టిందన్నావుగా...! ఆ కక్ష తీర్చుకోడానికి ఒక్కటే మార్గం.... ఈ పిం
వంటల్ని వాళ్లింటికి పంపు! కుటుంబానికి కుటుంబమే నాశనమై పోతుం

246] పేషెంట్: "ఏమండీ డాక్టర్‌గారూ?! రాత్రి పప్పు రుబ్బుతున్నట్లు
కలొచ్చింది."
డాక్టర్: "ఐతే... నిన్న రాత్రి కూడా ఇలాంటి కలే వచ్చింది ?"
పేషెంట్: "అబ్బే లేదండీ!! నిన్న రాత్రి మినప పప్పు నానబెట్టినట్లు కలొచ్చిం

247] ప్రేయసి: "వేణూ! మన ప్రేమ విషయం మీ నాన్నతో చెప్పావా
ఏమన్నారు ??"
ప్రియుడు: "ఏమీ అనలేదు. కానీ... వెంటనే ఊరెళ్లి... పెళ్లి సంబంధమ
ఖాయం చేసుకుని వచ్చేసారు."

248] అప్పారావు: "ఏమేవ్ సుబ్బులూ! మన చంటాడికి గాడిద నెక్కాల
ఉందట!! ఒకసారి మీ తమ్ముణ్ణి పిలువకూడదూ!!!"
సుబ్బులు: "ఆ మాత్రం దానికి వాడెందుకండీ!? మీరైతేనే చక్కగ
సరిపోతుంది. వీపు మీద ఎక్కించుకొని అటు-ఇటు తిప్పుకురండి! "

249] క్లాస్‌లో మాస్టర్ పాఠం సీరియస్‌గా చెప్పుకుపోతున్నారు. ఇంతల
ఆయనకు- బల్లపైన తలపెట్టి వేణు నిద్రపోవటం కనిపించింది. ప్రక్కనే
ఉన్న రమణతో మాస్టర్ ఇలా అంటారు...
"ఒరే... రమణా! నీ ప్రక్కన ఉన్న వేణుని కాస్త లేపరా!!"
రమణ: "ఎందుకు సార్!? మరో పది నిమిషాల్లో బెల్లుకొడితే వాడే లేస్తాడు."

250] డైరెక్టర్: "ఈ సినిమాలో మీరు మూగ పాత్ర ధరిస్తున్నారు. చిత్రానికి ఇదే హైలెట్!"
హీరో: "అది సరేనండి బాబూ! మరి మా ఆవిడ్ని కూడా మద్రాస్ ఎందుకు తీసుకురమ్మన్నారు ?"
డైరెక్టర్: "ఆ...! ఏం లేదు. షూటింగ్‌లో మీ ఆవిడ మీ ఎదురుగా కనిపిస్తూ ఉంటే యాక్షన్ నేచురల్‌గా, సుపర్బ్‌గా ఉంటుందని... అవార్డ్ కూడా రావచ్చునని..."

251] ఆరేళ్ళ అనూషకి అన్నీ అనుమానాలే తండ్రితో ఇలా అంటుంది....
అనూష: "నాన్నా? కాకి అరిస్తే చుట్టాలు వస్తారట కదా ? నా ఫ్రెండ్ రజని చెప్పింది. నిజమేనా ?"
తండ్రి: "అవునమ్మా! అందరూ అలాగే అంటారు."
అనూష: "మరి వచ్చి తిష్ట వేసుకున్న చుట్టాలు పోవాలంటే.. ఎవరు అరవాలి ?"
తండ్రి (నెమ్మదిగా) : "మీ అమ్మ!"

252] **మరికొన్నాళ్ళు వాడండి :-** ఒక మతిమరుపు మనిషి- డాక్టర్ దగ్గర మందులు తీసికొని... కొంత కాలం వాడాక... తనకి- జబ్బు నయమైనట్లుగ కనిపించింది. అపుడు డాక్టర్ దగ్గరకు వెళ్ళటానికి నిర్ణయించుకున్నాడు.
**మతిమరుపు మనిషి:** "డాక్టర్‌గారూ! మతిమరుపు తగ్గడానికి మీ ఇచ్చిన మందు బాగానే పనిచేస్తున్నదండీ!!"
**ఎదుటి వ్యక్తి:** "అలాగా.... వెరీగుడ్! ఇంకొన్నాళ్ళు ఆ మందును వాడుట మంచిది."
**మతిమరుపు మనిషి:** "ఎందుకు డాక్టర్‌గారూ ?! తగ్గిపోయింది కదా ?"
**ఎదుటి వ్యక్తి:** "నేను డాక్టర్‌ని కాదయ్యా బాబూ! కాంపౌండర్ని!!"

253] రంగారావు: "ఏమేవ్...! మన చంటాడు రోటిలో... దొడ్డికి కూర్చున్నట్టున్నాడే? వచ్చి చూడు."
రమాదేవి: "పోదురూ... మీదంతా బడాయి! అది బీరకాయ పచ్చడైతేనూ..."
రంగారావు: "చూడ్డానికి అలాగే ఉన్నా.. వాసనను బట్టి... మన చంటాడి పనేమో అనుకున్నాలే గానీ... కొత్తగా వంట చేసేటప్పుడు కొంచెము జాగ్రత్తగా ఉండవే!"

254] **ఇలా ఐతే ఏం పని ఉంటుంది? :-** ఇండియా పాకిస్తాన్ జట్ల మధ్య జరిగే హాకీ ఆట చూడ్డానికి ఒక మంత్రిగారు వచ్చారు. రెండు జట్లు సమఉజ్జీగా హేమాహేమీలు అయ్యేసరికి పోటీ చాలా తీవ్రంగా జరిగి ఆట డ్రాగా ముగిసింది. మ్యాచ్ ఐపోగానే తిరిగి వెళ్ళిపోతూ మంత్రిగారు నిర్వాహకులతో "మిగతా ఆటల మాదిరిగా... హాకీలో గెలుపు, ఓటమి ఉండవన్న మాట! ఐతే పని ఏముంటుంది?" అన్నాడు ఆవేశంతో.

255] హరిబాబు, గిరిబాబు బాల్య స్నేహితులు! చాలకాలము తరువాత కలుసుకొన్నారు.

హరిబాబు: "ఐతే నువ్వు ఇంతవరకు పెళ్ళి చేసుకో లేదన్న మాట! కారణం ఏమిటి ?"

గిరిబాబు: "నేను ఒక గొప్ప స్త్రీ కోసం చూస్తున్నాను..... ఎంతో కాలంగా!"

హరిబాబు: "ఐతే... మరి దొరకలేదా...?"

గిరిబాబు (నీరసంగా) : "దొరికింది. కానీ... ఆమె కూడా ఒక గొప్ప పురుషుడి కోసం ఎదురుచూస్తున్నదట!"

256] **మందుకోసం :-** ఇన్‌స్పెక్టర్: "ప్రమాదం జరిగినపుడు బాగా త్రాగి కార్ నడిపిం దెవరు ?"

తాగుబోతులలో ఒకడు: "మేమందరం తాగే ఉన్నాం సర్! ఐతే డ్రైవర్‌కు డోస్ చాలక... మా దగ్గరున్న మందుకోసం వెనుక సీట్లోకి వచ్చాడు అంతే...!!"

57] **ఎలా కనిపెట్టారు? :-** కస్టమర్: "ఏమయ్యా సర్వరూ?! మీ హోటల్‌ని చాలా పరిశుభ్రంగా ఉంచుతున్నట్లుందే ?"

సర్వర్: "అవును సార్! తమాషాగా ఉందే... ఎలా కనిపెట్టారు?"

కస్టమర్: "ఆఁ ఏముంది! ప్రతీదీ సబ్బువాసన కొడుతుంటేను."

258] ఒక చిన్న ప్రైవేట్ సంస్థలో క్లర్క్‌గా చేరాడు సుబ్బరావు! తనకు నెల జీతం నాలుగొందలేనని తెలిసి, మేనేజర్ని కలిసి... "నాకు ముందు పనిజేసిన వ్యక్తికి నెలకు రెండువేల రూపాయ లిచ్చి, నాకు నాలుగొందలు మాత్రమే ఇవ్వడం చాలా అన్యాయమ"ని చెప్పాడు సుబ్బరావు! అందుకు మేనేజర్ ఇలా అంటాడు.....

మేనేజర్: "నీకు ముందు పనిచేసిన వ్యక్తి చాలా అనుభవజ్ఞుడు! నువ్వు కొత్త గదా ?"

సుబ్బరాజు: "అవును సార్! అతనికి చాలా అనుభవము ఉన్నందున పని చేయడము లేదు! నేను కొత్తవాణ్ణి గదా?! ప్రతి విషయాన్ని పరిశీలించి... కష్టపడి పనిచేయాలిగదా...?! పెద్దలు... తమరే ఆలోచించండి!?"

259] రాజారావు: "ఏమోయ్ గుర్నాథం...! చెయ్యి కేమైంది!? కట్టు కట్టించావ్... యాక్సిడెంటా ?"

గుర్నాథం: "యాక్సిడెంటా ? పాడా?? రాత్రి సెకండ్ షోకి వెళ్ళినపుడు సినిమాలో మా ఆవిడ ఈ జబ్బ మీద కాస్త కునుకేసింది అంతే!"

260] భర్త: "నన్ను నమ్ము కమలా! నేను చీమకు కూడా ద్రోహము తలపెట్టలేను. నీ మీద ఒట్టు!"

భార్య: "ఆపండి మీ దొంగవేషాలు! బహుశా అది మగ చీమై ఉంటుంది. అందుకే బ్రతికిపోయింది."

261] గంగులు: "అబ్బ! నిన్న చాల మంచిరోజు నాకు!!"

రంగడు: "ఎలా!? ఏం జరిగిందో వివరంగా చెప్పు!"

గంగులు: "దొంగతనం చేసి వస్తుండగా... ఆ ఇంట్లో మనుషులు చూసి, కర్రలు తీసికొని తరుముకుంటూ వచ్చారు."

రంగడు: "ఆ! అలాగా ? తరువాత ఏమైంది??"

గంగులు: "అదృష్టవశాత్తు దగ్గర్లో ఓ పోలీస్‌స్టేషన్ కనపడింది. లోపల దూరాను. లేకపోతే... వాళ్ళంతా చితకబాదేవారు."

262] లాయర్: "ఇలా సాక్ష్యం చెప్పమని... ఎవరో నిన్ను ప్రేరేపించారు కదూ! నిర్భయంగా చెప్పు!!"

సాక్షి: "అవునండీ! నిజమే ప్రేరేపించారు."

లాయర్: "ఎవరో చెప్పు ?"

సాక్షి: "మా నాన్నగారేనండీ! పొరపాటున అబద్ధము చెప్పి ఆ ప్లీడర్ దగ్గర చిక్కుకోవద్దు. జరిగింది జరిగినట్లుగా, పొల్లుపోకుండా నిజం చెప్పేయ్ అన్నారు."

263] సురేష్: "అబ్బ! నేనెంత పొరపాటు పనిచేసానో... ఇప్పుడు అనుకొని ప్రయోజన మేముంది ?"

రమేష్: "ఆ...! ఏం జరిగింది ?"

సురేష్: "మతిమరుపు అనేది సాధారణంగా మేధావులకే వస్తూ ఉంటుంది. అంటూ మా ఆవిడతో అనటం చాలా పొరపాటై పోయింది."

రమేష్: "ఐతే... ఏం అనర్థం జరిగిందిరా!?"

సురేష్: "ఏం లేదు... కావాలనే కాఫీలో పంచదార, కూరలో ఉప్పు, రసంలో చింతపండు వెయ్యడం మరిచిపోతోంది. ఏం చేయాలో అర్థం కావటం లేదు?!"

264] హెడ్ మాస్టర్: "ఏం టీచర్‌గారూ!? మీ ఆయన్ని నీతోబాటుగా స్కూల్‌కు తీసుకురావటం ఏం బాగాలేదు."

టీచర్: "ఏం చేయనండీ?! ఈయనకి ఉద్యోగం లేకపోగా.... నేను స్కూల్‌కి వచ్చినపుడు... పనిపిల్లతో వెధవ్వేషాలేసి, నా కొంపను కూలుస్తున్నాడండీ!!"

265] హెడ్ మిస్ట్రెస్: "టీచర్‌గారూ! మీరు చంటాడిని బడికి తీసికొచ్చి గోల పెడుతున్నారండీ!! కొంతకాలం మెటర్నిటీ లీవ్ తీసికోరాదూ!?"

టీచర్: "ఇంతకీ ఏమైందండీ!?"

హెడ్ మిస్ట్రెస్: "ఏం లేదు... మీరు చంటాడికి పాలు ఇస్తున్నపుడు క్లాసులోని చిన్న పిల్లలు పాలు కావాలని ఒకటే గోల!"

266] పత్రికా విలేఖరి: "మేడమ్! మీ పలువరుస చాలా అందంగా, ఒద్దికగా ఉంటుంది. దాని రహస్య మేమిటండీ!?"

సినీతార: "అది నేనెలా చెప్పగలను? వాటిని తయారుచేసిన డెంటిస్ట్‌నే అడగండి!"

267] మునిసిపల్ చైర్మన్‌గారికి సన్మానము, విందు జరుగుతూ ఉంది. విందులో ఒక నడివయసామె, ఒక పడుచామె ప్రక్కప్రక్కనే కూర్చొని తింటూ... ఇలా మాట్లాడుకుంటూ ఉంటారు.

పడుచామె : "ఈ పట్నంలో... ఇంతమంది మేధావులు, విద్యా వంతులూ ఉండగా... ఎలాంటి తెలివి-తేటలు, చదువు లేని ఈ చవట సన్నాసే దొరికాడా చైర్మన్‌గా... ఎంత దౌర్భాగ్యమండీ!?"

నడివయసామె : "ఏం... తెలిసే మాట్లాడుతున్నావా...? తెలియక మాట్లాడుతున్నావా?? నేనెవర్నో తెలుసా నీకు???"

పడుచామె: "తెలియదు. ఇంతకీ మీరెవరు?"

నడివయసామె: "నేను ఆ చైర్మన్ గారి భార్యను!"

పడుచామె: "ఐతే... నేనెవర్నో మీకు తెలుసా ?"

నడివయసామె: "తెలియదు."

పడుచామె (మనసులో) : "ఐతే... నా వారి ఉద్యోగానికి ఏం ఢోకా లేదు."

268] భర్త: "ఏమే తాయారు ! ఆ బిచ్చగాడికి అంత ఉత్సాహంగా తిండి పెడతా వెందుకే??"

భార్య: "ఆ... ఏముంది ? వండిన వంట ఎలా ఉన్నా... ఎలాంటి వంకలూ పెట్టకుండా... బాగున్నదని మెచ్చుకొంటూ తినేవాళ్ళకే పెట్టాలని ఉంటుంది ఎవరికైనా!"

269] మేజిస్ట్రేట్: "ఏమయ్యా పెద్దమనిషీ?! నువ్వు గందరగోళంగా, తికమకగా జవాబు చెబుతున్నావు. ఇలా ఐతే ఎలా ? నీ తరఫున ఒక లాయర్ని పెట్టుకోరాదూ ?!"

ముద్దాయి : "తికమకగా మాట్లాడి, గందరగోళం సృష్టించి, నిజం తెలియనీయకుండా చెయ్యడం నాకు చేతకాకపోతేగదా సార్...? లాయర్ అవసరం!"

270] జనాభా లెక్కలు తయారు చేయడానికి బయలుదేరిన బడిపంతులు- ఒక వేశ్యవాడకు వెళ్ళి, ఒక ఇంటిలోని వేశ్యను కలిసి, వివరాల కోసం ఇలా అడిగాడు.

టీచర్: "అమ్మా మీ పేరేమిటి ?"

వేశ్య: "రేవతి."

టీచర్: "మీ భర్త పేరేమి టమ్మా ?"
వేశ్య: "రంగారావు... ఆ! కాదు... మోహన్... కాదు... వినోద్... ఆ... ఆ కాదు... అప్పారావు... ఆ ! అబ్బ!! ఎలా చెప్పేది ఎవరైంది ? ముందు మా అమ్మ పేరు, మా నాన్న పేరు రాసుకురండి! తరువాత భర్తపేరు ఆలోచిద్దాం!!"

271] మొదటి దొంగ: "ఛ.... ఛ... లోకం బొత్తిగా చెడిపోయింది. కాలం మరీ పాడైపోయింది."
రెండవ దొంగ: "ఏమైందిరా!?"
మొదటి దొంగ : "నేను రాత్రి ఒకళ్ళి కత్తితో బెదిరించి, డబ్బు లడిగితే... వాడు తుపాకి చూపించి, నా కత్తేగాక... ఒంటిమీద బట్టలు, లాచీ పట్టుకు పోయాడా!"

272] పార్టీ నాయకుడు: "సారీ మిస్టర్...! నీకు పార్టీ టికెట్ ఇవ్వలేం !! ఈసారి ఆలోచిద్దాం!!!"
భద్రయ్య (కత్తి తీసి) : "ఇవ్వకపోతే నిన్నిక్కడే ఖతం చేసి, సమాధి చేసేస్తా రాస్కెల్ !"
పార్టీ నాయకుడు: "భేష్ ! నేను పెట్టిన ఆఖరి పరీక్షలో కూడా నెగ్గావ్!! పార్టీ టికెట్ నీకే!!!"

273] కూతురు: "అమ్మా! ఆయన నా కన్యేయం చెయ్యాలని చూస్తున్నారే...!! ఏం చేయాలో... తెలీడం లేదు?"
తల్లి: "ఏమయ్యిందమ్మా?! దేన్నయినా ఉందుకున్నాడా ఏమిటే??"
కూతురు: "అచ్చే..! అలాయేంకాదు. 'సంవత్సరాల తరబడి నేను వంట చేయలేను. నువ్వు వంట నేర్చుకోవే!' అని ప్రాణం తీస్తున్నారే!!"

274] భార్య: "పెళ్ళికని ఊరికి బయలుదేరి వెళ్ళిన మీ అమ్మను వెంటనే తీసుకురండి!"
భర్త: "ఆహా ! మా అమ్మంటే నీకు అంత ఇష్టమా సరళా?"
భార్య: "అదేంలేదు. ఆవిడ నా పట్టుచీర కట్టుకొని వెళ్ళింది."

275] చోటా నాయకుడు : "సార్ ! తమరు ఎగస్పార్టీ అభ్యర్థిని తిట్టకుండా ఆయన పార్టీని తిరుతారెందుకు ?"

నాయకుడు : "అతడూ, నేనూ రేపు ఒకే పార్టీలో ఉండవచ్చునేమో? మెటామాటాలు పోగొట్టుకోవడం ఎందుకని... ముందు జాగ్రత్తగా అలా చేస్తున్నా!"

276] గొఱ్ఱెలు మేపుకుంటున్న గోపన్నను- ఒక పెద్దమనిషి పిలిచి ఇలా అడుగుతాడు....

పెద్దమనిషి: "గోపన్నా! ఈ మందలో ఎన్ని గొఱ్ఱెలున్నాయేమిటి ?"

గోపన్న: "ఆఱువందల తొంబై ఎనిమిది!"

పెద్దమనిషి (ఆశ్చర్యంగా) : "అంత కరెక్ట్‌గా ఎలా చెప్పగలిగావ్... ? ఆశ్చర్యంగా ఉందే?!"

గోపన్న: "ఇందులో ఆశ్చర్య మేమున్నదండీ?! అన్ని కాళ్ళను లెక్కవేసి, దాన్ని నాలుగుతో భాగిస్తే... మందలోని సంఖ్య వస్తుందిగా ?"

277] ఆఫీసర్: "ఏమోయ్ సూర్యం!? ఎప్పుడూ ఆఫీస్‌కు కనీసం గంట లేట్‌గా వచ్చేవాడివి ! ఇవాళేమిటి ? ఇంత త్వరగా వచ్చేవ్ ??"

సూర్యం : "ఆ! ఏముంది ? మా ఇంటికి చుట్టాలొచ్చారులే అక్కడ నిద్రపోవడానికి వీలు కుదరదుగదా...? ఇక్కడైతే సౌకర్యంగా ఉంటుందని!"

278] తొంబై తొమ్మిది పునుగులు తేలికగా తిన్న చిన్నారావుని- స్నేహితుడు ఇలా అడిగాడు....

స్నేహితుడు: "అదేమిటి?! ఆ ఒక్కటీ తింటే నూఱు పూర్తై పోతాయి గదా ?"

చిన్నారావు (కోపంగా) : "ఏరా!? రాస్కెల్ ! నీ కంటికి పందిలా కనిపిస్తున్నానా...? అన్నేసి తినడానికి!"

279] రంగనాథం: "ఏమయ్యా రామనాథం !? మీ కోడలు.ఈ మధ్య ఇంటిపనీ, వంటపనీ చేస్తున్నట్లుందే ?"
రామనాథం : "అవునుగానీ... మీరెలా ఊహించారు?"
రంగనాథం : "ఆఁ ఏముంది!? మీ ఇంట్లో పాత్రలన్నీ సొట్టలుపడీ, చిల్లులుపడీ ఉంటేను."

280] రోగి: "డాక్టర్‌గారూ ! కడుపునొప్పి భరించలేకుండా ఉన్నానండీ!"
డాక్టర్: "ఏం తిన్నావేమిటి ? కడుపు ఉబ్బరంగా ఉన్నట్లుంది."
రోగి : "పనస తొనలు తిన్నానండీ!"
డాక్టర్: "పనస తొనలా ? ఎన్ని తిన్నావ్ ?"
రోగి : "అబ్బే! ఎన్నోనా ? రెండే రెండు పండ్లు తిన్నానండీ!"(ఒక్కో 'పనస పండు'లో... వందకు పైన 'తొన'లుంటాయి మరి...)

281] తండ్రి : "ఏమండీ... మాస్టర్‌గారూ! మావాడు లెక్కలలో... ఫరవాలేదేండీ!?"
మాస్టర్: "అబ్బే! లాభం లేదండీ!! కనీసం ఎక్కాలు కూడా రావు. 'తొమ్మిది నాలుగులు ఎంత?' అంటే 'ముప్పై ఆరు' అంటాడింకా...."
తండ్రి: "ఓస్! అంతేగదా ? ఒకటి ఎక్కువ చెప్పాడన్నమాట! కొంతవరకు ఫరవాలేదు."

82] సుగుణారావు: "అబ్బా! ఏం చేయాలో తెలియడం లేదురా ?"
వామనరావు: "ఏమైందిరా ! సంగతేమిటి ?"
సుగుణారావు: "నిన్న ఎవడో ఆకాశరామన్న పేరుతో ఉత్తరం వ్రాస్తూ... నా భార్యతో తిరిగితే కాల్చిపారేస్తానని వ్రాసాడురా!"
వామనరావు: "ఐతే... భయపడ్డం దేనికి? తిరగడం మానెయ్."
సుగుణారావు : "ఉత్తరంలో సంతకం చెయ్యలేదు. ఎవరి భార్య అనే విషయం... నాకెలా తెలుస్తుంది ?"

283] అల్లరి చేస్తున్న ఆరేళ్ళ బాచిగాణ్ణి తల్లి బెదరిస్తూ ఇలా అంటుంది....
తల్లి : "వెధవా! ఏం గోలరా? ప్రాణాలు తీస్తున్నావ్! ఉండు రేప్!! నీ పెళ్ళి చేయిస్తా!!!"
బాచి : "పోమ్మా నువ్వు...! అప్పుడే నాకు పెళ్ళేంటి ? ఇంకా ఐదేళ్ళు నిండలేదా...??"

**284]** పనిమనిషి: "అమ్మగారూ!! నేను పని మానుకుంటున్నానండి..."
యజమానురాలు: "ఇంత హఠాత్తుగానా... ఏమైంది? ఎందుకు??"
పనిమనిషి: "నేనంటే మీకు బొత్తిగా నమ్మకం లేదు. నన్ను నమ్మని చోట నేనుండను."
యజమానురాలు: "ఎవరు చెప్పారే నీకు!? నీ మీద నమ్మకం లేదని?? ఇనప్పెట్టె తాళాలు కూడా దాయడం లేదే...!"
పనిమనిషి: "అవును నిజమే... ఒక్క తాళం కూడా పట్టిచావడం లేదెయ్యే?"

**285]** రాము: "ఒరే... గోపీ! ఎందుకురా ఆ చెడిపోయిన వాచీ ?, అవతల పడెయ్యక..."
గోపి: "భలేవాడివే! అది పూర్తిగా చెడిపోలేదు. రోజుకు రెండుసార్లు కరెక్ట్ టైమ్ చూపిస్తుంది."

**286]** ప్రఖ్యాత సినీనటి తన పుట్టినరోజు సందర్భంగా... ఎంతో మందిని ఆహ్వానిస్తుంది. ఆహ్వానితుల్లో పందొమ్మిదేళ్ళ జర్నలిస్ట్ ఇలా అంటాడు...
జర్నలిస్ట్: "మీ పుట్టినరోజు సందర్భంగా... నేను మీతో డ్యాన్స్ చేయాలని ఉవ్విళ్లూరుతున్నాను. నా కోరికను మన్నిస్తారా ?"
సినీనటి: "సారీ మిస్టర్! నీతో డ్యాన్సా...? ఛీ.... ఛీ.... నేను చిన్నపిల్లలతో డ్యాన్స్ చేయను."
జర్నలిస్ట్: "క్షమించాలి...: మీరు ప్రెగ్నెంట్ అని తెలియక అడిగాను."

**287]** బిచ్చగాడు: "అయ్యా! ఒక్క పావలా దానం చేయండి!!"
పెద్ద మనిషి: "ఇప్పుడు చిల్లర లేదులేవయ్యా! తరువాత తీసికొందువు."
బిచ్చగాడు: "ఇలా ఐతే ఎలా సార్! అందరూ అప్పులు పెడుతున్నారే...? నేను దివాలా తీయనా ??"

**288]** రాజారావు: "నాలుగొందల రూపాయలకు ఎంత కమీషన్ తీసు కుంటారు?"
పోస్ట్‌మెన్: "ఏదో తమ దయ సార్! తమ రెంతిస్తే అంత!!" (అన్నాడు తన ధోరణిలో)

**289]** ఓ పట్నం పిల్ల తన అక్క కొడుకులతో షికారు ముగించుకొని, బస్‌స్టాప్ చేరుకుంది. అక్కడే అరగంట నుండి వెయిట్ చేస్తున్న పల్లెటూరి దంపతులు- ఈ అమ్మాయితో మాట కలపటానికి ఇలా అంటారు...
పల్లెటూరి ఆమె : "కవల పిల్లలా...? ముద్దుగా ఉన్నారు. నీ పేరేమిటి ?"
పట్నం పిల్ల : "విమల."
పల్లెటూరి ఆమె : "వాళ్ళకి లవకుశులని పేరు పెట్టు..."
పట్నం పిల్ల : "అసలు నాకు పెళ్ళి కాలేదు."
పల్లెటూరి ఆమె : "ఐతే... శకుంతలని పేరు మార్చుకో...!"

**290]** ప్రక్కింటి పిన్ని : "ఏమిటమ్మాయ్ విజయ!? ప్రక్కన మేమున్నామని కూడా లేకుండా... వారం రోజుల్నించి నువ్వూ మీ ఆయన బలితెగించి లైట్ వేసుకుని మరీ శృంగారలీలను వెలిగించారు. అబ్బ...! అంత పబ్లిక్‌గానా ?"
విజయ : "అయ్యోయ్...! పొర్లాయనో... నా కొంప మునిగింది. పండక్కని పదిరోజుల ముందు పుట్టింటికెళ్ళి ఇప్పుడే వచ్చాను. అంతా ఐపోయింది."

**291]** కొడుకును సాగనంపుతూ ఓ సగటు తండ్రి : "ఒరేయ్ ఊరు చేరగానే ఉత్తరం వ్రాయి!!"
కొడుకు : "అట్లే.. వెంటనే డబ్బుతో పనుండదులే నాన్న !"

**292]** సినీనటి : "ఇద్దరు ఇంగ్లీష్ రైటర్ల పేర్లు చెప్పవయ్యా!?"
సెక్రెటరీ : "దేనికి మేడమ్!?"
సినీనటి : "ఇయ్యాల రేపో పత్రికలోళ్ళు వస్తామన్నారుగా... ఇంటర్వ్యూ చెయ్యడానికి..! అప్పుడు నేనిష్టపడే.. ప్రస్తుతాల రైటర్ల పేర్లు అడుగుతారుగా ? మరి గుర్తెట్టుకోవద్దా...!"

**293]** ఒక గ్రామంలో... డ్రామా వేస్తున్నారు. అరగంటలో ప్రారంభం కాబోతుంది. శివుడు పాత్రధారి ఇంకా రానందున డ్రామా కాంట్రాక్టర్ మేకప్ రూమ్‌నుండి బయటకు వస్తూ "సాంబశివా! ఎన్ని కష్టాలు? నాకిప్పుడేం దారి?? నన్ను ముంచుతావా... తేలుస్తావా???"
ఈ మాటలకు కైలాసంలోని శివుడు తన భక్తుడు కష్టాల్లో ఉన్నాడని గ్రహించి ప్రత్యక్షమై "భక్తా! ఏం వరం కావాలి ? కోరుకో ఇస్తాను." అన్నాడు.

"ఓర్నీ దుంపతెగ... ! ఏదో రోగం వచ్చిందని కబురు చేస్తే... డ్రామా ఆగిపోతుందని ఆడలి చచ్చిననుకో! అదృష్టవశాత్తు సరైన టైమ్‌కే వచ్చేవు. పద మేకప్ రూమ్‌లోకి" శివుడికి మతిపోయినంత పనైంది.

**294]** పేషెంట్: "డాక్టర్‌గారూ! ఆపరేషన్ తరువాత కాంపౌండర్ కుట్లు వేస్తారుట!! బాగా వెయ్యగలడా!?"

డాక్టర్: "గాభరాపడకండి! ఇంతకు ముందు ఇతను టైలర్‌గా పనిచేసాడు."

**295]** నర్స్: "ఏమిటి... డాక్టర్‌గారూ?! పేషెంట్‌కి ఆపరేషన్ చెయ్యాలని నిర్ణయించుకొని చివరి క్షణంలో నిర్ణయాన్ని మార్చుకున్నారు!?"

డాక్టర్: "ఆ...! ఏముంది? ఈయన భార్య భయంతో వణికిపోతూ వచ్చి కాళ్ళమీద పడి డాక్టర్‌గారూ ! నాకు మాంగల్య భిక్ష పెట్టండి!! అంటూ బ్రతిమాలుకొంది"

**296]** హైక్లాస్ క్షౌరశాలలోకి ఒక లాయర్ డ్రస్ వేసుకున్న పెద్ద మనిషి ఒక చిన్న పిల్లవాణ్ణి తీసుకువచ్చి "ఈ పిల్లవాడికి క్రాప్ చేయాలి. నాకు క్షవరం చేయాలి. ఎంతవుద్ది ?" అనడిగాడు. అందుకు ఆ షాపువాడు "ఏడు-ఐదు పన్నెండు రూపాయలవుద్ది!" అన్నాడు. ముందు తన క్షవరం చేయించుకున్నాడు. తరువాత "పిల్లవానికి క్రాప్ చేయమ"ని బయటకు వెళ్లాడు. క్రాప్ చేయడం పూర్తైంది. ఐనా... లాయర్ డ్రస్ ఆయన రాలేదు. అప్పుడు...

క్షౌరకుడు: "ఏం అబ్బాయ్ !? మీ నాన్న ఇంకా రాలేదేమిటి!?"

పిల్లవాడు: "మా నాన్నా?! ఆయన మా నాన్న కాదు..."

క్షౌరకుడు: "మరి నిన్ను తీసికొచ్చినాయన ఎవరు?"

పిల్లవాడు: "ఆయనెవరో నాకేం తెలుసు ? నేను పార్క్‌లో ఆడుకుంటుంటే నీకు పైసా ఖర్చు లేకుండా క్రాప్ చేయిస్తానురా అని నన్ను ఇక్కడికి తీసికొచ్చాడు."

**297]** పేషెంట్ : "డాక్టర్‌గారూ ! నేను బరువు బాగా పెరిగేలా... టానిక్, బిళ్ళ
రాసివ్వండి!!"
డాక్టర్ : "మీరు ఎత్తు ప్రకారం ప్రస్తుతమున్న బరువు చాలు!"
పేషెంట్ : "కాని... మా ఆవిడ నన్ను చీటికి మాటికి తేలిక చ
మాట్లాడుతోంది డాక్టర్!"

**298]** గుమాస్తా: "ఈ నాలుగేళ్ళ నుండి నలుగురి పని నేనొక్కణ్ణే చేస్తున్నా కు
జీతం మాత్రం ఒక్కపైసా పెంచారు కారు !"
యజమాని: "నలుగురి పనిని ఒక్కడివే చేస్తున్నావు కదా?! ఆ ముగ్గు
ఎవరో చెప్పు! వాళ్ళని తీసిపారేస్తాను."

**299]** పెద్దిశెట్టి: "ఏం? రావులమ్మా...! మరీ ఇంత దగా చేస్తావా!? వెన్న ఐ
కేజీలని చెప్పి అరకేజీకి పైగా తక్కువ ఇచ్చావ్!"
రావులమ్మ (అమాయకంగా) : "అదేమిటి శెట్టిగారూ ! తూకానికి
దగ్గర రాళ్ళు లేకపోతే తమరిచ్చిన ఐదు కేజీల ఉల్లిపాయల్ని పెట్టి తూచాన
పైగా ఒక గరిట పెచ్చు కూడా వేశాను."

**300]** రోగి : "డాక్టర్‌గారూ ! నాకు అస్సలు నిద్రపట్టడం లేదు."
డాక్టర్ : "రాత్రి పడుకోబోయే ముందు ఏదైనా తిని, పాలు త్రాగి పడుకో
నిద్రపడుతుంది."
రోగి : "కానీ... తమరు పది రోజుల క్రితం పడుకునే ముందు ఏది
తినొద్దన్నారుగా !"
డాక్టర్ : "నేను చెప్పినట్లు చెయ్యి! ఈ పదిరోజుల్లో వైద్యశాస్త్రం ఎంత
మారిపోయిందో నీకు చెప్పినా అర్థం కాదులే?!"

**301]** రాజారావు : "ఏమిటి వరహాల్రావ్?! అంత విచారంగా ఉన్నావు??"
వరహాల్రావ్: "ఆ ! ఏం లేదు. ఈరోజే వీలునామా రాశాను! అందులో నా
భార్యకి లక్షరూపాయలు, ఇద్దరి కొడుకులకి చెరో నాలుగు లక్షలు,
కూతుళ్ళిద్దరికి చెరో లక్ష వ్రాసాను."
రాజారావు : "ఐతే... మరి విచారం దేనికి ?"
వరహాల్రావ్: "అదే... అంత డబ్బు ఎలా సంపాదించడమా అని?"

302] అప్పారావు: "మా కుక్క చాలా గొప్ప జాతి కుక్క! దీన్ని చూస్తే దొంగలకు హడల్!! పరాయి వాళ్లను... లోపలికి రానీయనే రానీయదు."
రామారావు: "కుక్క చాలా బాగుంది. మెడలో వెండి పట్టీ లాటిదేదన్నా వేస్తే చక్కగా ఉంటుంది. ఒకటి చేయించరాదూ!?"
అప్పారావు: "ఇంతకు ముందు వెండి బెల్ట్ చేయించి వేశాం! కాని దొంగ వెధవలెవరో కాజేశారు. అప్పట్నుంచి ఏమీ ఉంచడం లేదు."

303] రంగనాథం: "ఏమోయ్ రామారావ్!? ఆ మధ్య రాత్రుళ్ళు ఏవో పీడకలలు వస్తున్నాయని అన్నావు. ఇప్పుడెలా ఉంది ? భూత వైద్యుళ్ళెవర్నయినా సంప్రదించావా?? లేదా???"
రామారావు: "లేదండీ! ఇప్పుడు బాగానే ఉంది. మా ఆవిడ ఫోటోని తలక్రింద ఉంచుకొని నిద్రపోతున్నాను. కలలు గిలలు ఏమీలేవు."

304] జ్యోతిష్యుడు చెయ్యి చూస్తూ అప్పారావుతో ఇలా అంటాడు.
జ్యోతిష్యుడు: "అయ్యో! మీకు ఒక దుర్వార్త!! మీ భార్య కొద్ది రోజుల్లోనే హత్య చేయబడుతుంది."
అప్పారావు: "అది నాక్కూడా తెలుసునుగానీ... ఇంతకు నేను దొరుకుతానా? లేదా!??' ఆ సంగతి చెప్పు ముందు!"

305] అవధాన్లు: "ఏం గుర్నాథం?! ఎక్కడికి... చీకటి పడ్డాక వెళుతున్నావ్?"
గుర్నాథం: "ఆత్మహత్య చేసుకుందామని!"
అవధాన్లు: "మరి చేతిలో ఆ టార్చ్‌లైట్ ఎందుకు ?"
గుర్నాథం: "చీకటి గదా...! పురుగు పుట్ర ఉంటాయని...!!"

306] రాంబాబు: "నిన్న మా పెద్దక్కని కౌగిలించుకున్నావ్‌లే నే చూశాగా..."
పక్కింటి ప్రేమకుమార్: "ష్! గట్టిగా అనవకు!! ఈ పది రూపాయలు తీసుకో!!!"
రాంబాబు: "ఊహూ...! మా అక్క బాయ్‌ఫ్రెండ్స్ అందరి దగ్గరా ఇరవై రూపాయలు తీసుకుంటాను. పదైతే వద్దు!"

307] వినోద్: "ఏరా అనిల్! ఎలా ఉన్నావ్? చాన్నాళ్ళకు కనబడ్డావ్!"
అనిల్: "1990 వరకు బాగానే ఉన్నానురా వినోద్!"
వినోద్: "ఆ తరువాత ఏమైందిరా నీకు!?"
అనిల్: "ఏముంది?! పెళ్ళైంది లేరా!"

308] ఆస్తి పంపకాల దగ్గర ఇద్దరు అన్నదమ్ములకి తగాదా వచ్చింది. వారిద్దరూ ఊరి పెద్ద అయిన వెంకట్రామయ్య వద్దకు వెళ్ళి "అంతా విన్నారు కదా...! తమరెలా చెబితే అలా వింటాం... సలహా చెప్పు!" అన్నారు. ఊరిపెద్ద వెంకట్రామయ్యగారు జాగ్రత్తగా ఆలోచించి ఇలా సలహా ఇస్తాడు... "ఉన్న ఆస్తి మొత్తాన్ని రెండు భాగాలుగా చేసే బాధ్యత అన్నది. తనకు ఏ భాగం కావాలో కోరుకునే హక్కు తమ్ముడిది."

309] క్లాసుకు ఆలస్యంగా వచ్చిన ఇద్దరు విద్యార్థుల్ని చూసి కోపంతో మండిపడి మాస్టర్ ఇలా అంటాడు.
మాస్టర్: "ఏరా రాజా! ఇంత ఆలస్యం ఎందుకైంది?"
రాజు: "నా రూపాయిబిళ్ళ రోడ్డు మీద పడిపోతే దాన్ని వెతకడం మూలాన ఆలస్యమైందండీ!"
మాస్టర్: "మరి నీవెందుకు ఆలస్యంగా వచ్చావురా గోపీ!?"
గోపీ: "నేనండీ... ఆ రూపాయి బిళ్ళమీద నుంచున్నానండీ!"

310] ముగ్గురు అమాయకులు తమ తమ గొప్పలు చెప్పుకుంటూ ఇలా మాట్లాడుకుంటారు...
మొదటి వాడు: "పెళ్ళైన ఆర్నెల్లకే మా ఆవిడ నెల తప్పింది."
రెండవవాడు: "అదేం గొప్ప...? పెళ్ళయిన రెండునెలలకే మా ఆవిడ నెల తప్పింది."
మూడవవాడు: "మీది ఒక గొప్ప కిందనే లెక్కా...? మా ఆవిడ పెళ్ళికి ఆర్నెల్ల ముందే నెల తప్పిందట!"

311] ఒక తెలివైన జల్సారాయుడు సినిమాహాల్‌లో ఎదురు సీట్‌పై కాళ్ళు బార్లాచాపి దర్జాగా విలాసంగా సిగరెట్ కాలుస్తూ ఉంటాడు. అప్పుడు ఎదురు సీట్లో కూర్చున్న వ్యక్తి కోపంగా ఇలా అంటాడు.

వ్యక్తి: "ఏం పనయ్యా ఇది?! అదే నీ సీట్ మీద కాళ్ళు పెడితే నీకెలా ఉంటుంది?"

జిల్హారాయుడు: "కావాలంటే మీరు నా సీట్ మీద నిరభ్యంతరంగా కాళ్ళు పెట్టుకోవచ్చు. నాకెలాంటి అభ్యంతరమూ లేదు."

312] భార్యా భర్తల వివాదం కోర్టులో విచారణ జరుగుతోంది.

భర్త: "విడాకులు తీసుకోవడానికి నేను అంగీకరించను!"

భార్య: "ఇవ్వకపోతే నేనూరుకోను!"

భర్త: "నేను ఏం చేశానని విడాకులు ఇవ్వాలి?"

భార్య: "ఏమి చెయ్యడంలేదనే నేను విడాకులివ్వమంటుంది."

313] ఆఫీసర్: "ఏమయ్యా పెద్దమనిషి!? బయట బోర్డ్ చూడలేదా? అనుమతి లేకుండా లోనికి రాకూడదని..."

పెద్దమనిషి: "చిత్తం! చూశానండీ!!"

ఆఫీసర్: "చూసే వచ్చానన్న మాట...! ఏం అంత నిర్లక్ష్యం?!"

పెద్దమనిషి : "ఇందులో నిర్లక్ష్యము ఏముందండీ...!? అనుమతి అడుగుదామనే లోనికి వచ్చా!"

314] విలేఖరి : "ఏమయ్యా! నీవు రోజూ అడుక్కుంటున్నావ్ గదా? ఎంత సంపాదిస్తున్నావ్? సంపాదించే దేమి చేస్తున్నావ్??"

బిచ్చగాడు : "రోజుకి ఇరవై రూపాయలండీ! ఐదు రూపాయలు పెట్టి లాటరీ టిక్కెట్లు కొంటాను."

విలేఖరి: "ఒకవేళ లాటరీలో నీకు లక్ష రూపాయలు వచ్చాయనుకో? ఏం చేస్తావ్??"

బిచ్చగాడు: "అంత అదృష్టమే పడితే... వెధవ ఈ రేకు పళ్ళాన్ని విసిరికొట్టి వెండి పళ్ళెంలో అడుక్కుంటానండీ!"

315] భార్య: "ఏమండీ! మీ పుట్టినరోజుగదాని నేనే వంట చేశాను. వడ్డిస్తాను రండి!"

భర్త (భయంగా): "ముందు వీధిలో ఒక్క కుక్కని పిలిచి... దానికి పెట్టు! తిన్న తరువాత అది ఇంకా బ్రతికి ఉంటే... నేనూ తింటాను."

316] జానకి : "ఏమండీ డాక్టర్‌గారూ?! మా ఆయన్ని మీరే రక్షించాలి. ఆయనెప్పుడూ హా హా ఆ హా... అంటున్నారండీ!"
డాక్టర్: "ఇంతకీ మీ ఆయన ఏం చేస్తుంటారమ్మా?!"
జానకి: "కరాటే అట! దాన్ని నేర్చుకుంటున్నారండీ!!"

317] అప్పారావు, పాపారావు ఇద్దరూ ఫైనల్ ఇయర్ చదువుతున్నారు. ఇద్దరూ తెలివి తక్కువ దద్దమ్మలే అని చెప్పడానికి వారి వయసు 30 పైగా ఉంటుంది. వారు పరీక్షలు వ్రాసి బయటకు వచ్చి ఇలా మాట్లాడుకుంటున్నారు.
అప్పారావు: "పరీక్ష ఎలా రాశావురా!?"
పాపారావు: "ఆ...! ఏం రాయడంలే? తెల్ల పేపర్ ఇచ్చివచ్చా!"
అప్పారావు: "అయ్యో...! ఎలారా?! నేను కూడా తెల్ల పేపరే ఇచ్చా! దిద్దేవారు మనిద్దరం కాపీలు కొట్టామని అనుకుంటా రేమోరా?!"

318] ఒక రాజకీయ నాయకుడు కుటుంబ సమేతంగా నెహ్రూ జూలాజికల్ పార్క్‌కు వెళతాడు. అక్కడ కోతులను చూసిన తన చిన్న కొడుకు కిషోర్ ఇలా అంటాడు...
కిషోర్: "నాన్నా...! నాన్నా...!! నిన్న మా మాస్టారు పాఠం చెబుతూ... మనం కోతి నుంచి పుట్టామని చెప్పారు. నిజమేనా ?"
నాయకుడు: "ఛీ ! ఛీ !! మనం కాదురా... అపోజిషన్ పార్టీ వాళ్ళు పుట్టారు."

319] ప్రొఫెసర్ భార్య : "ఏమండీ...! మన బాబు- పది రోజుల్నుంచి నడుస్తున్నాడండీ!!"
ప్రొఫెసర్ : 'అలాగా...! అరె... ఇప్పుడెలా...? ఇప్పటికే చాలాదూరం వెళ్ళిపోయుంటాడే??"

320] గుర్నాథం : "రోజూ రాత్రి భోజనాలు పూర్తయ్యాక... నేను తీరిగ్గా మాట్లాడే మాటలంటే మా ఆవిడ... చెవి కోసుకుంటుందంటే నమ్మండి!"
జోగినాథం: "ఏమిటా మాటలు ?"
గుర్నాథం : "వాటిని అలా వదిలెయ్...! నేను తీస్తానులే...!! నేను కడుగుతానులే... వగైరా మాటలు!!!"

321] ఒక పరధ్యానపు ప్రొఫెసర్ డిన్నర్‌కు వస్తాడు. ఒక అందమైన స్త్రీ ఆయన్ని ఇలా పలకరిస్తుంది.
స్త్రీ: "ఏమండీ ప్రొఫెసర్‌గారూ! నేను మీకు గుర్తున్నానా? అదేనండి! కొన్ని సంవత్సరాల క్రితం నన్ను పెళ్ళి చేసుకుంటారా? అని అడిగారే ఆమెనే నేను..."
ప్రొఫెసర్: "ఓహో...! మేను ఇంతకీ పెళ్ళి చేసుకున్నానా? లేదా?"

322] ఆఫీసర్: "ఎవరు కావాలండీ మీకు !?"
పెద్ద మనిషి: "సత్యమూర్తి కావాలండీ...! సాయంత్రం సెలవు మంజూరు చేస్తే... నా వెంట తీసికెళతాను."
ఆఫీసర్: "అరే! ఇంతకుముందే సెలవు పెట్టి వెళ్ళాడండి!! వాళ్ళ నాన్న అంత్యక్రియలకి హాజరు కావడం కోసం!!! ఇంతకీ తమరెవరు...?"
పెద్ద మనిషి: "వాళ్ళ నాన్ననండీ!"

323] కపిల్ దేవ్: "చూడు... వెంకటపతిరాజా ! ఆ రవిశాస్త్రి నాకు సూచనలు, సలహాలు ఇస్తున్నాడు. ఇంత అనుభవమున్న నాకే ఎలా చెబుతున్నాడో?" అన్నాడు బాధగా.
వెంకటపతిరాజు: "మీకు చెప్పడమేమిటి సార్...?! ఆట గురించి నాకే చెబుతుంటేనూ! నేనెంత బాధపడాలి ?"

324] తగిన వరుడు దొరక్క ముదిరిన ముప్పై ఏళ్ళ కూతురికి పేపర్ ప్రకటన ఇచ్చింది. ఫలాన అర్హతలున్న వరుడు కావాలని! మరుసటి రోజే పేపర్‌లో ప్రకటన వచ్చింది.
మరో వారం రోజులు పిదప తల్లి కూతురితో ఇలా అంది...
తల్లి: "చేటీ! మన బాక్స్ నంబర్‌కి లెటర్సేమైనా వచ్చాయా ?"
కూతురు: "ఆ...! ఒక్క ఉత్తరమే వచ్చిందమ్మా...!!"
తల్లి: "ఎవరు రాశారమ్మా...! త్వరగా చెప్పు."
కూతురు: "అబ్బ! నేను చెప్పను."
తల్లి: "నాక్కూడా చెప్పకపోతే ఎలా?"
కూతురు (సిగ్గుగా): "నాన్నే రాశారమ్మా...!"

325] మొదటి దొంగ: "అంతటి మహాపేరు-ప్రఖ్యాతులున్న రాజకీయ నాయకుడి ఇంట్లో దొంగతనం చేసి సంతోషించాలి గాని ఎందుకురా...? అంత బాధపడిపోతున్నావ్!"

రెండవ దొంగ: "ఆ ఏం లేదు. జాతి ద్రోహము తలపెట్టానని అంతరాత్మ ప్రబోధిస్తున్నది. అందుకనే ఏడుపు ఆగటం లేదు."

326] రామనాథం: "ఆహా...! ఏమి నా భాగ్యం? లలాలాల...!"

జోగినాథం: "ఏమిటి రామనాథం? మంచి జోరుగా ఉన్నావ్! ఏమిటి సంగతి??"

రామనాథం: "నేను చాల అదృష్టవంతుణ్ణయ్యా! పండక్కి రావడం కుదరదని ఇద్దరు అల్లుళ్ళు లెటర్స్ వ్రాశారు."

327] ప్యూన్: "లోపలికెళ్ళడానికి ఇప్పుడు కుదరదండి! ఆఫీసర్‌గారు లోపల చాల బిజీగా ఉన్నారు."

పెద్దమనిషి: "సర్లేవయ్యా...! ఎన్ని గంటలకు నిద్రలేస్తారో చెప్పు?"

328] టీచర్: "ఒరే రాజా...! గుఱ్ఱపు స్వారీలో ఒలింపిక్ గోల్డ్ మెడల్ సాధించాలంటే.. మనవారికి ఒక చిట్కా చెప్పరా!"

రాజు: "మనవాళ్ళకి తప్ప... మిగిలిన వాళ్ళందరికీ గాడిదల్ని ఇవ్వాలి సార్!"

329] పెద్దమనిషి: "బాబూ! ఇంట్లో మీ నాన్నగారున్నారా? డబ్బు ఇవ్వాలి."

పిల్లవాడు: "మీరివ్వాలా? మీకు మా నాన్నగారివ్వాలా??"

పెద్దమనిషి: "నేను ఇవ్వాలి బాబూ!"

పిల్లవాడు: "ఐతే... నాకివ్వండి! నే వెళ్ళి ఇస్తాను."

పెద్దమనిషి: "మీ నాన్నగారే ఇవ్వాలి."

పిల్లవాడు: "ఏదో ఊరెళ్ళారు. ఎప్పుడొస్తారో కూడా తెలియదు."

330] రాంబాబు: "నన్నయ్య ఏ శతాబ్దికి చెందినవారండీ!?"

తెలుగు మాస్టర్: "నోర్మూయరా వెధవా! హిస్టరీ మాస్టర్ని అడగాల్సిన ప్రశ్న నన్ను అడుగుతావేంట్రా...? కూర్చో!"

**331]** రాజ్యలక్ష్మి: "ఇదిగో రత్తాలు...! గిన్నెలు ఇలాగేనా కడిగేది...? సర్ఫ్ పెట్టి బాగా కడగాలని తెలీదా...?? ఎన్ని సార్లు చెప్పాలి నీకు...! ఇక ముందు కడగాల్సినవన్నీ శుభ్రంగా సర్ఫ్ వేసి కడుగు!! అస్తమానం నేను చెప్పలేను."
రత్తాలు: "అలాగే అమ్మగారు! మీరు చెప్పినట్లే చేస్తాను."
రాజ్యలక్ష్మి: "సరేలేగానీ... నేను మహిళామండలికి వెళ్ళాలి. త్వరగా ఒక అరసోల బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టు!"
రత్తాలు: "అలాగే అమ్మగారు!"
రాజ్యలక్ష్మి (ఒక గంట తరువాత): "ఏమే రత్తాలు అన్నమేంది... సర్ఫ్ కంపు కొడుతున్నది?"
రత్తాలు: "మీరేగదా అమ్మగారు! బియ్యం కడిగి, అన్నం వండమన్నారు. కడగాల్సినవన్నీ సర్ఫ్‌తోనే కడగమన్నారు."

**332]** రామారావు: "ఏమిట్రా? పొద్దున్నే అలా దిగులుగా తలపట్టుకూర్చున్నావ్! ఏమిటి సంగతి?"
అప్పారావు: "దిగులుపడక ఏం చేయమంటావ్...? ఈ ఐదేళ్ళలో లక్షా ఎనభై వేల రూపాయలు నష్టం!"
రామారావు: "నష్టమా? అయ్యో! అంత నష్టం ఎలా వచ్చిందిరా?"
అప్పారావు: "ఇవ్వాల్టికి నేను కాలేజ్ చదువు పూర్తి చేసికొని, ఐదు సంవత్సరాలైంది. ఈ ఐదేళ్ళుగా నేను ఏ ఉద్యోగమూ లేకుండా ఉన్నాను. నా లెవల్‌కి కనీసం మూడు వేల రూపాయల జీతం వచ్చినా... ఐదేళ్ళలో అంత డబ్బు సంపాదించి ఉండే వాణ్ణిగదా?!"

**333]** డాక్టర్: "క్షమించాలి రాజారావుగారూ! అప్పారావుకు చెయ్యాల్సిన ఆపరేషన్ పొరపాటున మీకు చేసేసాను."
రాజారావు: "ఫరవాలేదులే డాక్టర్‌గారు! కనీసం ఫీజైనా అప్పారావు దగ్గర వసూలు చేసి పుణ్యం కట్టుకోండి!!"

334] తండ్రి: "నీవు అతనిలో ఏముందని పెళ్ళి చేసుకుంటున్నావు తల్లీ? నా మాట విని ఆ ప్రయత్నం మానుకోవాలి!"
కుమార్తె: "ఆయనకేం నాన్నా! అంతులేని ఆస్తి, చాలా పొలం, ఎన్నో ఫ్యాక్టరీలు ఉన్నాయి."
తండ్రి: "కాని... అతనికి నాకన్నా ఎక్కువ వయస్సే ఉంటుందమ్మా!"
కుమార్తె: "వయసుదేముంది నాన్నా...!? ఆయన దగ్గర వయసులో ఉన్నవారు ఎంతో మంది పనిచేస్తున్నారుగా?"

335] క్రొత్తగా పని నేర్చుకుంటానికి వచ్చిన తన కొడుకుతో బార్బర్‌షాప్ యజమాని ఇలా అంటాడు.
బార్బర్ షాప్ యజమాని: "అదుగో ఎవరో గడ్డానికి వస్తున్నాడు."
కొడుకు: "అవును నాన్నా! ఆయనతో మొదలెట్టేది పని?"
బా॥ య॥: "అలాగే బాబూ! జాగ్రత్త!! చెయ్యి కోసుకునేవు."

336] కామేశ్వరరావు: "లక్ష రూపాయలు లాటరీలో వచ్చినా దిగులుగా ఉన్నావేం శంకర్రావ్!?"
శంకర్రావ్: "కొన్నది రెండు టిక్కెట్లు గదా! రెండోదానికి ఒక్కరూపాయి కూడా రాలేదు మరి..."

337] నిర్మాత: "ఇప్పుడు వచ్చే కొత్త దర్శకులతో పెద్ద పేచీగా వుందయ్యా!"
మరో నిర్మాత: "ఏమిటంత పెద్ద పేచీ?"
నిర్మాత: "ఓ సీన్‌ని- 'క్లోజప్'లో తీయమంటే... 'కోల్గేట్'లో ఎందుకు తీయకూడదని అడుగుతున్నారయ్యా!!"

338] ప్రియురాలు: "ప్రియా! నీతో మాటలాడిన తరువాత... నా తల నొప్పి పూర్తిగా తగ్గిపోయింది."
ప్రియుడు: "నిజమే...! నిన్ను వదిలిపెట్టి ... నన్ను పట్టుకుంది."

339] గోపీ: "వాడెవండీ బాబూ?! ఏమడిగినా... ఠంగ్ ఠంగ్‌మని సమాధానము చెబుతూ... చంపుతున్నాడు!"
జాన్: "అతగాడు చర్చ్‌లో గంటలు కొట్టే వాడులే!"

340] రాము: "నీకు ఈత రాదు కదా..?! నావికాదళములో ఎలా చేర్చుకున్నారు??"
సాగర్: "నా పేరు చూసి... ఈతను గురించి పట్టించుకోలా...!".

341] ఆఫీసర్: "ఏమిటి...? ఇంత ఆలస్యముగా వచ్చావ్!?"
ఉద్యోగి: "బస్‌లో నిద్రపోతుంటే... స్టేజ్ దాటిపోయింది."
ఆఫీసర్: "ఆఫీస్‌లో చేసేపని... ఆఫీస్‌లోనే చేయాలని తెలిసికో...!"

342] భర్త: "ఛ...! ఛ...!! మరీ నీ నోటికి హద్దు లేకుండా పోతున్నది. ఇక లాభము లేదు... తాళము వేయవలసినదే!"
భార్య: "వేస్తే వేసారు గానీ... ఆ వేసేది బంగారపుది వేయండి!"

343] బ్యాంక్ మేనేజర్: "లోన్ ఇస్తే... పాలిచ్చే ఏనుగును కొంటావా...? నీకు గాని మతిపోలేదు కదా....??"
కస్టమర్: "లేదయ్యా! ఏనుగికి అడిగితే... మేకకైనా ఇస్తారని !!"

344] M.D. : "ఏమిటి ? నిన్న-మొన్న ఆలస్యముగా ఇంటికి వెళ్ళావట??"
స్టెనో: "మొన్న- ఒక తప్పు చేసాను. నిన్న కూడా అదే తప్పు చేయమని మన చైర్మన్‌గారు అడిగారు. అందు కాలస్యమైంది."

345] భిక్షగాడు: "అమ్మా! బాబూ !! 14 వందల రూపాయలు ధర్మము చేయండి... బాబూ... అమ్మా... త్వరగా చేయండి!!! ఇన్‌కమ్ టాక్స్ కట్టాలి."

346] పొరుగింటావిడ: "నీ కోడలి కేమిటి...? అకస్మాత్‌గా పిచ్చి పట్టిందట??"
ఇంటావిడ: "క్రొత్తగా T.V. కొన్నాము కదా...!? దానిలో D.D. ప్రోగ్రామ్స్ చూసి...."

347] పీనాసి టెక్నీషియన్: "యాసిడ్‌లో... ఈ రూపాయ నాణెము వేస్తున్నాను... ఇది కరుగుతుందా? కరగదా??"
అసిస్టెంట్: "గ్యారంటీగా కరగదు గాక... కరగదు."
పీ॥ టె॥ : "ఇంత గ్యారంటీగా ఎలా చెప్పగలిగా వచ్చు!?"
అసిస్టెంట్: "పైసను కూడ వేస్ట్ చెయ్యని మీ తత్వాన్ని బట్టిసార్...!"

348] సహోద్యోగి: "మన ఆఫీస్ మేనేజర్ నీ పెళ్ళికి ఏమిచ్చాడు ?"
ఉద్యోగి: "ఒక పదిరోజుల సెలవు గ్రాంట్!"

**349]** నీలిమ ఫ్రెండ్: "డాక్టర్ వద్ద పనిచేస్తున్నావు కదే...? బాగుందా??"
నర్స్ నీలిమ: "ఏమి చెప్పమంటావే...?! తలనొప్పన్నా, కడుపు నొప్పన్నా, జ్వరమన్నా... ట్యాబ్లెట్స్, ఇంజక్షన్స్ ఇస్తాడు గాని... ఒక్కపూట సెలవు ఇవ్వడు."

**350]** భార్య: "ఏమండీ...!? మీకు 'సుగర్ వ్యాధి' వచ్చిన దేమోనండీ?!"
భర్త: "నీ కెందుకు ఆ అనుమాన మొచ్చిందే....?!"
భార్య: "ఈ మధ్యన మీ మాటలు చాల తీయగా ఉంటున్నాయండీ!"

**351]** రాము: "గోపీ! సెంట్రల్ కేఫ్‌కి వద్దు. గోల్డెన్ కేఫ్‌కి వెళదాము. అక్కడ ఇడ్లీలు మెత్తగా దూదిలా వుంటాయి."
గోపీ: "నీ మొహం...! నీకేం తెలుసు...? ఆ ఇడ్లీలు రాళ్ళలా ఉంటాయి."
రాము: "లేదురా...! బిల్ కట్టలేక రాత్రి నేనే ఇడ్లీ పిండి రుబ్బాను."

**353]** పేషెంట్: "నిద్రలో నడచు వ్యాధికి మీ రిచ్చిన మందు మాంచి పవర్‌ఫుల్‌గా... సూపర్బ్‌గా పనిచేసింది డాక్టర్ !"
డాక్టర్: "పని చేస్తుందని నాకు ముందే తెలుసు ! వ్యాధి తగ్గిందా ?"
పేషెంట్: "ఆ ఇప్పుడు నిద్రలో నడచుట లేదు... పరుగెత్తడమే!"

**353]** పేషెంట్: "చికెన్ బిర్యానీ తిన్నాను డాక్టర్! ఒళ్ళంతా నిప్పుల మీద కాల్చినట్లు జ్వరము ప్రేలిపోతున్నది... డాక్టర్ !!"
డాక్టర్: "బహుశః మీరు ఆస్ట్రిచ్ (నిప్పుకోడి) బిర్యానీ తిని వుంటారు."

**354]** మిత్రుడు: "ఏమిటిరా...!? ప్రతిరోజూ ఆఫీస్ కెళ్ళేటప్పుడు నీ భార్య నీ చెవిలో ఏదో గుసగుసలుగా చెబుతుందేమిటి??"
ఉద్యోగి: "ఏమి లేదురా...! 'గుడ్‌నైట్-స్వీట్‌డ్రీమ్స్' అని చెబుతుంది."

**355]** జడ్జ్: "నీవు 'ఘన ప్రశస్తి' అను నటి బ్రాను తస్కరించావా?"
ముద్దాయి: "దొంగిలించలేదు. అవసరమై తెచ్చాను."
జడ్జ్: "అవసరానికి తేవడమేమిటి ? అడగకుండా...?!"
ముద్దాయి: "రేషన్ షాప్‌లో... పంచదార ఇస్తున్నారు. నా సంచి చినిగిపోయింది. ప్రక్కనున్న ఆ నటి ఇంటిలోకి వెళితే... ఆ 'బ్రా' దొరికింది. తెచ్చాను."

356] వరద బాధితుడు : "అయ్యా ! ఇక్కడంతా... వరదనీరు పొంగి పొరలిపోతోంది. అపుడే మోకాళ్ళదాకా నీరు వచ్చి చేరింది. త్వరగా వచ్చి ప్రాణాలు కాపాడండి ! ఆలసిస్తే... ప్రాణము పోతుంది." అని కంగారుగా ఫోన్‌లో చెప్పాడు.
వరద నివారక అధికారి : "ఎందుకంత కంగారు...? మోకాళ్ళ దాకేగా నీరు వచ్చింది...?? ఏదైనా ప్రక్కనున్న మేడమీదికి ఎక్కండి...! వస్తున్నాము !"
వ॥ బా॥ : "బాబూ...! నేనిప్పుడు ఉన్నది... నా ఏడంతస్తుల మేడమీదే...!?"

357] నటశేఖర్: "నే నిపుడు ఓ డాక్టర్ వద్ద పార్ట్‌టైమ్ జాబ్ చేస్తున్నాను!"
నటుడి మిత్రుడు : "అదేమిట్రా...!? నటన మానేసి, కాంపౌండర్‌గా చేస్తున్నావా??"
నటశేఖర్ : "లేదురా...! ఆ డాక్టర్ అప్పుడప్పుడు నన్ను పేషంట్‌గా నటింపజేస్తుంటాడు. పేషెంట్స్‌ని రాబట్టుకొనుటకు!"

358] కొడుకు: "మా బామ్మను ఈ వయసులో... వయోజన విద్య నేర్చుకొనుటకు పంపవద్దంటే... విన్నావా? చూడు...! ఇపుడేమి జరిగిందో...!?"
తల్లి: "ఇపుడేమైందిరా...!? చక్కగా చదువుతుంటేనూ...?!"
కొడుకు: "ఏమైందా...? ఓ తాతయ్యకి ప్రేమలేఖలు రాస్తున్నది."

359] నిర్మాత: "మన సినిమాకి ఏదైనా పోటీపెట్టి... గెలుపొందిన వారికి పదిలక్షలు బహుమతిగా ప్రకటిస్తే... కలెక్షన్ పెరుగుతుందేమో చూద్దామా!? ఐతే... పోటీలో ఎవరూ గెలుపొందకూడదు. అలా ఉండాలంటే...?"
రచయిత : "దీనికి పెద్దగా ఆలోచించే దేమున్నది? కథను అర్థము గాకుండా వ్రియమనండి! వారి జుట్టు వారే పీక్కుంటారు."

360] కోడలు : "ఓ వారము రోజులుగా నాకు... మా అత్తగారికి గొడవలేదు."
ప్రక్కింటావిడ : "చాల ఆశ్చర్యముగా ఉందే...? ఆస్పత్రిలో చేరిందా... మీ అత్తగారు?!"
కోడలు : "అచ్చే... లేదు...! నోరు కుట్టి పారేసాను."

361] భర్త: "మన అబ్బాయికి తల్లి పాలివ్వమని డాక్టర్ చెప్పారు."
భార్య: "అలాగా... పాలిచ్చే తల్లి కావాలని పేపర్‌లో వేయించండి!"

362] భార్య: "ఏవండీ! ప్రక్కింటావిడ చీర తీసికెళ్ళి వారము రోజులైంద ఇంకా తేలేదేమిటో... అనుమానముగా ఉన్నది ?"
భర్త: "ఆ చీర ఏడాది క్రితము నీవు అరువు తెచ్చుకొని ఇవ్వలేదు గ తన చీరను ఆవిడ గుర్తుపట్టి ఉంచుకొన్నదేమో...??"

363] కస్టమర్: "నా బిల్‌కు సరిపోను పిండి రుబ్బించుకున్నారుగ ఇంకేమిటి... చెట్నీ రుబ్బమంటారూ...??" కోప్పడ్డాడు.
సర్వర్: "నిజమేగానీ... నాకు 'టిప్' ఇవ్వలేదుగా...?"చల్లగా చెప్పాడు

364] ఖైదీ: "జైలర్‌గారూ...! నాకేమన్నా లెటర్స్ వస్తే... జాగ్రత్త చేయండి!!"
జైలర్: "విడుదలై వెళ్ళిపోతున్నావుగా... లెటర్స్ దాయడమెందుకు?"
ఖైదీ: "లేదు సర్...! రేపో-మాపో వచ్చేస్తాగా...!?"

365] రాజు: "ఏమిటిరా...!? తిన్నగా ఆఫీస్ నుండే వచ్చేసావ్వా...?"
సోము: "అరె... అంత కచ్చితముగా ఎలా చెప్పగలిగావురా...?!"
రాజు: "దీనికి పెద్ద తెలివి-తేటలెందుకురా...!? నీ 'నిద్ర ముఖము' చాలద

366] భిక్షగాడు: "అమ్మగారూ... అమ్మగారూ... త్వరగా రండి !"
గృహిణి: "ఏంటయ్యా...!? అడుక్కోడానికి వేళా-పాళా లేదా...??"
భిక్షగాడు: "లేదమ్మా...! అడుక్కోడానికి రాలేదు. అయ్యగారు వర్కింకి సైక అడిగారు. బ్యాంక్ చెక్ ఇద్దామని వచ్చాను."

367] పనివాడు: "మీరు చాల అదృష్టవంతులు సార్! నిజంగా అదృష్టవంతులు !!"
యజమాని: "ఏమిటిరా...! అంత అదృష్టము ? నాకేమి లాటరీ రాలేదే?
పనివాడు: "బోడి లాటరీ కూడా అదృష్టమేనా...? మీకు అప్పి కోటీశ్వరులంతా... టోపా కట్టేస్తున్నారుగా సార్...!?"

368] కోడలు: "ఏమిటే...!? మా అత్తగారి ముఖము, మా పెంపుడు క ముఖము ఒకేలా ఉన్నదని... ఊరంతా టామ్ టామ్ వేస్తున్నావట...?"
పనిపిల్ల: "అది నిజమేగా... అమ్మగారూ!? నేనేమి అబద్ధము చెప్పలేదే...
కోడలు: "ఛీ... నోర్మూయ్! మా కుక్క ముఖము మరీ అంత ధండాలమా...

369] డాక్టర్: "నేనిచ్చిన దగ్గుమందు ఎలా పనిచేస్తున్నది ?"
పేషెంట్: "మీరిచ్చిన ఆ దగ్గు మందు త్రాగుటకంటే... దగ్గడమే తేలిక డాక్టర్!"

370] ఉద్యోగి: "రెండేళ్ళపాటు రేయింబవళ్ళు నిద్రలేకుండా శ్రమించి... చివరికి ఎలాగైతేనేమి... ఈ గవర్నమెంట్ జాబ్‌ను సంపాదించాను!"
మిత్రుడు: "శభాష్! ఇక ఆఫీస్‌లో హాయిగా నిద్రపోవచ్చు!"

371] శేఖర్: "ఏరా...! మీ నాన్న ఊరంతా దోచుకుంటున్నాడట...?"
చంద్ర: "ఛ... లేదురా...! చిన్న కాన్వెంట్ నడుపుతున్నాడంతే...!!"

372] టీచర్: "ఒకటి+ఒకటి=రెండు! రెండు+రెండు ఎంత బుజ్జీ...?!"
విద్యార్థి: "పోండి... టీచర్! తేలికది మీరు చెప్పి... క్లిష్టమైనది అడుగుతున్నారు నన్ను!!"

373] రామయ్య: "ఏరా...! అమ్మాయికి వెయ్యి కాసులిచ్చి... పెళ్ళి చేసావటగా...? అల్లుడు ఏమి చేస్తున్నాడురా...??"
కుబేరయ్య: "ఆ వెయ్యి కాసులనూ పెట్టి... నగల వ్యాపారము చేస్తున్నాడు!"

374] డాక్టర్: "ఇలాంటి ఆపరేషన్స్ వేలాదిగా చేసాను!" అని పేషెంట్‌తో చెప్పి... మనసులో "మీరైనా బ్రతికి బట్ట కట్టాల"ని భగవంతుని ప్రార్థించు కున్నాడు.

375] శ్రోత-1: "ఆ గాయకుడు... క్లిష్టమైన రాగములను అతి కష్టపడి పాడుతున్నాడు..."
శ్రోత-2: "ఔను...! వినుట కూడ కష్టముగానే ఉన్నది మరి...!"

376] అతిథి-1: "పెండ్లికొడుకు ఫోటోగ్రాఫర్‌ని... ఎందుకు అలా తిడుతున్నాడు?"
అతిథి-2: "చివరిసారిగా ఓ నవ్వు నవ్వండి... అన్నాడట!"

377] డాక్టర్: "మీ ఆవిడ ఇక ఎక్కువ రోజులు బ్రతుకదు."
పేషెంట్ భర్త: "మీ మాటలను నమ్మి... వేరే సంబంధమును చూసుకోవచ్చా...?"

378] నిర్వాహకుడు: "ఫుట్‌బాల్ పోటీలను ప్రారంభించమని చెప్పి ఆ అహింసామూర్తిని తీసికొని వచ్చుట చాల పొరపాటైనది."
కార్యకర్త: "ఏమైనది సార్...! ఆయన చాల మంచివాడేగా...?"

నిర్వాహకుడు : "మంచివాడే...! కానీ... ఒక్క బంతి కొలకెంద తన్నుకొంటారు ? తలొక బంతిని తీసికోమని చెబుతున్నాడు."

379] సంఘసేవిక : "దేవాలయము ప్రక్కన కల్లు దుకాణము పెట్టకూడ ఆందోళన చేపట్టారు కదా...? విజయము సాధించారా...??"
సంఘసేవకుడు: "ఆ... సాధించాను...! దేవాలయమును ప్రక్కవీధిల మార్చారు." విజయగర్వముతో చెప్పాడు.

380] బావ: "అబ్బ...! నిన్నటి నుండి ఒకటే పన్ను నొప్పిరా...!!"
బావమరది : "అందుకేగా బావా ! మా అక్కతో మంచిగా వుండ చెప్పినది."

381] పేషెంట్: "డాక్టర్...! మూడ్రోజుల నుండి ఒకటే... కడుపు నొప్పి!"
డాక్టర్: "అరె... సేమ్ ప్రాబ్లమ్ నాది! పద రెస్టారెంట్-కి తిరుగుదాం!"

382] పేషెంట్-1: "ఈ డాక్టర్ బలే విచిత్రమైన వారులే... ?"
పేషెంట్-2: "అంటే... వ్యాధులను విచిత్రంగా తగ్గిస్తారా ?"
పేషెంట్-1: "అబ్బే.. అదికాదు. పర్స్ చూడమంటే... పర్స్ చూస్తారు

383] పేషెంట్: "ఏమిటి... డాక్టర్!? ఆపరేషన్ థియేటర్‌లోనికి.... పశు కాపరేషన్ చేసే డాక్టర్ వచ్చాడు ??" ఆశ్చర్యముగా అడిగాడు.
డాక్టర్: "ఇది మేజర్ ఆపరేషన్ కదా...? అందుకని పిలిపించా...!"

384] బాటసారి: "బాబూ...! ఆ ఇంటికి 'చిల్లర ఇల్లు' అన్న పేరును పెట్టారేమిటి
గృహస్థు: "అది ఒక బస్ కండక్టర్... 'చిల్లరతో కట్టించుకొన్న' ఇల్లు

385] కస్టమర్: "భోజనములో... ఉప్పు-కారం వేదయ్యా...!? చప్పగా ఉన్న
సర్వర్: "అలాగా...? తెలియదు సార్!?... మేము ప్రక్క హోటల్‌లో తింటామ

386] T.V.లో ఉత్తరములు-జవాబుల కార్యక్రమమును- రమ్య రాంబ నిర్వహిస్తున్నారు. ఒక లెటర్ చదువసాగారు.
రమ్య: "ఈ ఉత్తరము పిచ్చాసుపత్రిలోని 'మెంటల్'గారు వ్రాసింది!"
రాంబాబు: "మన అభిమాన పాఠకురాలే...! ఏమని వ్రాసింది ?"
రమ్య: "ప్రసారాలన్నీ మా కోసమే అతి ప్రత్యేకముగా తయారు చేస్తున్నార సంతోషము!! పాపము... మిగతా వారికి కూడ ఒక జనరల్ ప్రోగ్రామ్ తయారుచేసి... ప్రసారముచేస్తే... వారూ సంతోషిస్తారు అని!!!"

